

ఓమ్ పరబ్రహ్మణే నమః.

శ్రీశతకోటి రామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే వాల్మీకీయే మనోహరకాండాంతర్గతే

# చైత్రమాసమాహాత్మ్యము.

ఇది

మచిలీపట్టణ నివాసులును

జిల్లా నాగలింగశాస్త్రులవారి పుత్త్రులగు

## లక్ష్మీనృసింహశాస్త్రిచే

ఆంధ్రతాత్పర్యసహితముగా వ్రాయఁబడి

బ్రll కావూరి రంగయ్యశాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁబడి

స్వకీయశ్రీ

ఆర్యానందముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె

మచిలీపట్టణము.

ప్రథమ ముద్రణము

400 ప్రతులు

దీని వెల 0—8—0

1938

 (పోస్టుఖర్చులు ప్రత్యేకము)



శ్రీరస్తు.

శ్రీసీతారామచంద్రపరబ్రహ్మణేనమః.

# చైత్రమాసమాహాత్మ్యము.



అథ సార్ధమాస ద్వయీ పూజా ప్రయోగాంతర్గత చైత్ర స్నానవిధి స్తదుపాఖ్యాన మతో౽త్రోదాహ్రియతే॥ శ్రీమదానందరామాయణే॥ మనోహరకాండే॥

తా॥ శ్రీరామసంబంధమగు పూజావిధిని గురించి రెండుమాసముల పదిహేను దినములనియు దానివిధానమును పూర్వము చెప్పఁబడియున్నది. ఆడెబ్బదియైదు దినములలో చైత్రమాసము చేరియున్నది. కాబట్టి ఆచైత్రమాసములో స్నానముచేయు విధానము చేసినందువలన ఫలమును అందును గురించి యుదాహరణములను శ్రీమదానందరామాయణములో మనోహరకాండమునందు చెప్పఁబడియున్నది. కాఁబట్టి అట్టి చైత్రమాసమహాత్మ్యమును విపులముగా నందరికిని తెలియునట్లు విమర్శించి వ్రాయఁబడుచున్నది.

---

రామదాసఉవాచ॥ శ్లో॥ ఏవంశిష్యత్వయాపూర్వం యేయే ప్రశ్నాఃకృతాశ్శుభాః। శ్రీరామవిషయే తేతే మయోక్తాః పరమాదరాత్॥ ౧॥ ఇదానీంతేపునశ్శ్రోతు మిచ్ఛాస్తితాం వదస్వమాం। యద్యత్పృచ్ఛసిభో౽వత్స తత్సర్వం ప్రవదామ్యహం॥ ౨॥ శ్రీమహాదేవఉవాచ॥ ఏవం గురోర్వచశ్శ్రుత్వా విష్ణుదాసో౽బ్రవీత్పునః॥

తా॥ రామదాసుయనెడుగురువు విష్ణుదాసుడనెడు శిష్యునితో చైత్రమాసఫలమును చెప్పెనని సాంబమూర్తి పార్వతీదేవితో చెప్పిన విషయము. అది యెట్లనఁగా ఓశిష్యుఁడా! శ్రీరామచంద్రమూర్తిని గురించి నీవు చేసిన ప్రశ్నలు యోగ్యమైనవి కాఁబట్టి వాటికన్నింటికిని శ్రద్ధతో సమాధానమును జెప్పితిని. మఱియు ఆరామచంద్రమూర్తి మహిమను వినవలయునని నీకు వాంఛ యున్నయెడల తిరిగి ప్రశ్న చేయుము. ఓచిన్నవాఁడా! నీవు దేనిని గురించి యడిగెదవో

దాని నంతయు జెప్పెదనని రామదాసుడనెడు గురువు విష్ణుదాస
నెడు శిష్యునితో చెప్పుచున్నాడు.

విష్ణుదాస ఉవాచ॥ శ్లో॥ గురోత్వయా త్వయోధ్యాయ
చైత్రమాసఫలం మహత్ । ప్రోక్తం తద్విస్తరేణాద్య కథయ
మమాంతికమ్॥

తా॥ విష్ణుదాసు డడుగుచున్నాడు. ఓ గురో! పూర
అయోధ్యాపట్టణములో మనము నివసించి యున్నప్పుడు చైత్ర
ఫలమును గుఱించి సూక్ష్మముగా జెప్పియుంటివి. అంతటితో
తృప్తి కాలేదు. కాఁబట్టి యిప్పుడా చైత్రమాసమాహాత్మ్య
సవిస్తరముగా జెప్పవలయునని విష్ణుదాసుఁడు రామదాసు నడిగె

శ్లో॥ కిందానం కింఫలంతస్య కముద్దిశ్యచ రేద్వ్రతం । కో
కదారంభః స్సర్వంవిస్తరతో వద॥ ౪॥ యత్సరయ్వాం రామ
స్నాతవ్యం చేతికీర్తితమ్॥ ౫॥

తా॥ మఱియు ఆచైత్రమాసములో నేమి దాన మియ
యును. చేసినందువలన నేమి ఫలము కలుఁగును. ఎవరిని గు
వ్రతమును చేయవలయును. ఎప్పుడు ప్రారంభించవలయును.
చేయవలెను. సరయూనదియందుగల రామతీర్థములో స్నా
జేయుటవలన విశేషఫలము కలుగునని చెప్పఁబడియున్నది. న
యీచేయఁబడిన ప్రశ్నల నన్నింటికిని సమాధానమును జెప్పి
సంతోషపరుపవలయునని శిష్యుఁడడిగెను.

రామదాసఉవాచ॥ శ్లో॥ సాధుసాధుమహాప్రాజ్ఞ శుభః
కృతస్త్వయా। అధునా చైత్రమాసస్య మహిమాప్రోచ్యతేమయ

తా॥ రామదాసు చెప్పుచున్నాడు. మంచి బుద్ధిశాలివి
యోశిష్యుఁడా! శుభప్రదమైనట్టియు యోగ్యమైనట్టియు ప్రశ్న
చాలా బాగుగానున్నది. ఇప్పుడు చైత్రమాస మహిమను
చెప్పెదను నీవు శ్రద్ధతో వినుము.

శ్లో॥ మాసానాం ప్రథమోమాస శ్చైత్రమాసఃప్రకీ
ర్తితః సర్వజీవానాం సద్య ఇష్టఫలప్రదః॥ ౬॥

తా॥ చైత్రమాసము పండ్రెండు మాసములలో మొదటిదై యున్నది కాబట్టి సమస్తజీవరాసులకు తల్లివలెనే యెల్లప్పుడు సమస్త కోరికల నిచ్చును.

శ్లో॥ దాన యజ్ఞ వ్రతసమ స్సర్వ పాప వినాశనః । ధర్మసారః క్రియాసార స్తపస్సారస్సమర్చితః॥ ౮॥

తా॥ దానములు యజ్ఞములను జేయునట్టి ఫలము నొసగునదియు సమస్తపాపములను నశింపజేయునదియు, ధర్మములలోను క్రియలలోను తపస్సులలోను శ్రేష్ఠమైనది కాబట్టి యాచరింపవలెను.

శ్లో॥ విద్యానాం వేదవిద్యేవ మంత్రాణాం ప్రణవోయథా । భూరుహాణాం సురతరు ర్ధేనూనాం కామధేనువత్ ॥ ౯॥

తా॥ విద్యలలో వేదమువలెను, మంత్రములలో ఓంకారమువలెను, వృక్షములలో కల్పవృక్షమువలెను, గోవులలో కామధేనువువలెను శ్రేష్ఠముగా జెప్పఁబడెను.

శ్లో॥ శేషవత్సర్వనాగానాం పక్షిణాంగరుడోయథా । దేవానాంతుయథావిష్ణు ర్వర్ణానాం బ్రాహ్మణోయథా॥ ౧౦॥

తా॥ అన్ని సర్పములలో నాదిశేషువువలెను, పక్షులలో గరుత్మంతుడువలెను, దేవతులలో విష్ణుమూర్తివలెను, నాలుగు జాతులలో బ్రాహ్మణజాతివలెను శ్రేష్ఠముగా జెప్పఁబడియున్నది.

శ్లో॥ ప్రాణవత్ప్రియ వస్తూనాం భార్యేవసుహృదాం యథా । ఆపగానాం యథాగంగా తేజసాంతురవిర్యథా॥ ౧౧॥

తా॥ ప్రేమగల వస్తువులలో ప్రాణమువలెను, స్నేహితులలో భార్యవలెను, నదులలో గంగానదివలెను, ప్రకాశించెడు వస్తువులలో సూర్యుడువలెను శ్రేష్ఠమైనదిగా జెప్పఁబడెను.

శ్లో॥ ఆయుధానాంయథావజ్రం ధాతూనాంకాంచనంయథా । వైష్ణవానాంయథారుద్రో రత్నానాం కౌస్తుభోయథా॥ ౧౨॥

తా॥ ఆయుధములలో వజ్రాయుధమువలెను, లోహములలో బంగారమువలెను, విష్ణుభక్తులలో రుద్రుడువలెను, రత్నములలో కౌస్తుభమణివలెను శ్రేష్ఠమైనది.

దాని నంతయు జెప్పెదనని రామదాసుడనెడు గురువు విష్ణుదాసుడ నెడు శిష్యునితో చెప్పుచున్నాడు.

విష్ణుదాస ఉవాచ॥ శ్లో॥ గురోత్వయా త్వయోధ్యాయాం చైత్రమాసఫలం మహత్ । ప్రోక్తం తద్విస్తరేణాద్య కథయస్వ మమాంతికమ్॥

తా॥ విష్ణుదాసు డడుగుచున్నాడు. ఓ గురో! పూర్వము అయోధ్యాపట్టణములో మనము నివసించి యున్నప్పుడు చైత్రమాస ఫలమును గుఱించి సూక్ష్మముగా జెప్పియుంటివి. అంతటితో నాకు తృప్తి కాలేదు. కాబట్టి యిప్పుడా చైత్రమాసమాహాత్మ్యమును సవిస్తరముగా జెప్పవలయునని విష్ణుదాసుడు రామదాసు నడిగెను.

శ్లో॥ కిందానం కింఫలంతస్య కముద్దిశ్యచ రేద్వ్రతం । కోవిధిశ్శ కదారంభ స్సర్వంవిస్తరతోవద॥ ౪॥ యత్సరయ్వాం రామతీర్థే స్నాతవ్యం చేతికీర్తితమ్॥ ౫॥

తా॥ మఱియు ఆచైత్రమాసములో నేమి దాన మియ్యవల యును. చేసినందువలన నేమి ఫలము కలుగును. ఎవరిని గుఱించి వ్రతమును చేయవలయును. ఎప్పుడు ప్రారంభించవలయును. ఎట్లు చేయవలెను. సరయూనదియందుగల రామతీర్థములో స్నానము జేయుటవలన విశేషఫలము కలుగునని చెప్పఁబడియున్నది. కాబట్టి యీచేయఁబడిన ప్రశ్నల నన్నింటికిని సమాధానమును జెప్పి నన్ను సంతోషపరుపవలయునని శిష్యుఁడడిగెను.

రామదాసఉవాచ॥ శ్లో॥ సాధుసాధుమహాప్రాజ్ఞ శుభఃప్రశ్న కృతస్త్వయా। అధునాచైత్రమాసస్య మహిమాప్రోచ్యతేమయా॥ ౬

తా॥ రామదాసు చెప్పుచున్నాడు. మంచి బుద్ధిశాలివి యగ యోశిష్యుఁడా! శుభప్రదమైనట్టియు యోగ్యమైనట్టియు ప్రశ్న జేసితివి చాలా బాగుగానున్నది. ఇప్పుడు చైత్రమాస మహిమను గుఱించి చెప్పెదను నీవు శ్రద్ధతో వినుము.

శ్లో॥ మాసానాం ప్రథమోమాస శ్చైత్రమాసఃప్రకీర్త్యతే మాతేవ సర్వజీవానాం సదాహేప్ట ఫలప్రదః॥ ౭॥

తా॥ చైత్రమాసము పండ్రెండు మాసములలో మొదటిదై యున్నది కాఁబట్టి సమస్తజీవరాసులకు తల్లివలెనే యెల్లప్పుడు సమస్త కోరికల నిచ్చును.

శ్లో॥ దాన యజ్ఞ వ్రతసమ స్సర్వ పాప వినాశనః । ధర్మసారః క్రియాసార స్తపస్సారస్సమర్చితః॥ ౮॥

తా॥ దానములు యజ్ఞములను జేయునట్టిఫలము నొసగునదియు సమస్తపాపములను నశింపజేయునదియు, ధర్మములలోను క్రియలలోను తపస్సులలోను శ్రేష్ఠమైనది కాఁబట్టి యాచరింపవలెను.

శ్లో॥ విద్యానాం వేదవిద్యేవ మంత్రాణాం ప్రణవోయథా । భూరుహాణాం సురతరు ర్ధేనూనాం కామధేనువత్॥ ౯॥

తా॥ విద్యలలో వేదమువలెను, మంత్రములలో ఓంకారము వలెను, వృక్షములలో కల్పవృక్షము వలెను, గోవులలో కామధేనువు వలెను శ్రేష్ఠముగా జెప్పఁబడెను.

శ్లో॥ శేషవత్సర్వనాగానాం పక్షిణాంగరుడోయథా । దేవానాంతుయథావిష్ణు ర్వర్ణానాం బ్రాహ్మణోయథా॥ ౧౦॥

తా॥ అన్ని సర్పములలో నాదిశేషువువలెను, పక్షులలో గరుత్మంతుడువలెను, దేవతలలో విష్ణుమూర్తివలెను, నాలుగు జాతులలో బ్రాహ్మణజాతివలెను శ్రేష్ఠముగా జెప్పఁబడియున్నది.

శ్లో॥ ప్రాణవత్ప్రియ వస్తూనాం భార్యేవసుహృదాం యథా । ఆపగానాం యథాగంగా తేజసాంతురవిర్యథా॥ ౧౧॥

తా॥ ప్రేమగల వస్తువులలో ప్రాణమువలెను, స్నేహితులలో భార్యవలెను, నదులలో గంగానదివలెను, ప్రకాశించెడు వస్తువులలో సూర్యుఁడువలెను శ్రేష్ఠమైనదిగా జెప్పఁబడెను.

శ్లో॥ ఆయుధానాంయథావజ్రం ధాతూనాంకాంచనంయథా । వైష్ణవానాంయథారుద్రో రత్నానాం కౌస్తుభోయథా॥ ౧౨॥

తా॥ ఆయుధములలో వజ్రాయుధమువలెను, లోహములలో బంగారమువలెను, విష్ణుభక్తులలో రుద్రుడువలెను, రత్నములలో కౌస్తుభమణివలెను శ్రేష్ఠమైనది.

శ్లో॥ పుష్పేషుచ యథా పద్మం సరసాం మానసం యథా మాసానాం ధర్మహేతూనాం చైత్రమాస స్తథాస్మృతః॥ ౧౩॥

తా॥ పుష్పములలో తామరపద్మము వలెను, సరస్సులలో మానస సరస్సువలెను, ధర్మము నాచరింపతగిన మాసములలో చైత్రమాసము శ్రేష్ఠమైనదిగా సమస్త మునీశ్వరులు చెప్పియున్నారు.

శ్లో॥ నానేనసదృశో లోకే విష్ణుప్రీతి విధాయకః । చైత్రే స్నానేచనిరతే మీనే ప్రాగరుణోదయాత్॥ ౧౪॥ లక్ష్మ్యా సహాయో భగవాన్ ప్రీతిం తస్మిన్ కరోత్యసౌ॥

తా॥ చైత్రమాసముతో సమానమైనది విష్ణుమూర్తిని సంతోషపెట్టుటకు మఱియొకటిలేదు. కాఁబట్టి చైత్రమాసములో స్నానము జేయునపేక్షగలవాఁడు అరుణోదయమునకు పూర్వము స్నానముజేయవలయును. అట్లుచేసినయెడల భగవంతుండగు విష్ణుమూర్తి లక్ష్మీదేవితో గూడినవాఁడై వానికి శ్రేయస్సుల నొసఁగును.

శ్లో॥ జంతూనాం ప్రీణనంయద్వ దన్నేనైవహి జాయతే । తద్వచ్చైత్రేచస్నానేన విష్ణుః ప్రీణాత్యసంశయః॥ ౧౫॥

తా॥ అన్నమును భుజించుటచే జంతువులకు తృప్తి యగునట్లుగానే చైత్రమాసములో స్నానము జేయుటచే విష్ణుమూర్తి సంతోషించును. సందేహము లేదు.

శ్లో॥ యోచైత్రస్నాన నిరతాన్ జనాన్ దృష్ట్వానుమోదతే । తావతాపివిముక్తాఘో విష్ణులోకేమహీయతే॥ ౧౬॥

తా॥ చైత్రమాసములో స్నానము జేయుచున్నవారిని జూచి యెవఁడు సంతోషించునో వాఁడు అంతమాత్రముచేతనే సమస్తపాపముల వల్లను విడువబడి వైకుంఠములో నివసించువాఁడగును.

శ్లో॥ సకృత్స్నాత్వామీనసంస్థే సూర్యేప్రాతఃకృతాహ్నికః । మహాపాపవిముక్తోసౌ విష్ణుసాయుజ్య మాప్నుయాత్॥ ౧౭॥

తా॥ చైత్రమాసమంతయు సూర్యుఁడు మీన సంక్రమణమందు ప్రవేశించి యుండఁగా ప్రాతఃకాలమందు స్నానము జేసి సంధ్యావందనాది క్రియలను జరిగించుచు ధర్మాచరణము నడుపువాఁడు మహా

పములనన్నియు బోగొట్టుకొని వైకుంఠలోకమునందు నివసించు
ట్టి వాడగును.

శ్లో॥ స్నానార్థం చైత్రమాసేయః పాదమేకం చరేద్యది
శ్వమేధాయుతానాంచ ఫలం ప్రాప్నోత్యసంశయః॥ ౧౮॥

తా॥ చైత్రమాసములో నాల్గవవంతు దినములు అనఁగా ఒక
ారము రోజులు స్నానము చేసినట్టివాడును పదివేల అశ్వమేధములు
ేసినట్టి ఫలమును పొందును సందేహము లేదు.

శ్లో॥ అథవా కూటచిత్తస్తు కుర్యాత్సంకల్పమాత్రకః । సోపి
్రతుశతం పుణ్యం లభతేహి నసంశయః॥ ౧౯॥

తా॥ లేక అశక్తుడగుచు స్నానము జేయలేని వాడగునేని
ంకల్పము మాత్రము జేసినవాడయినను నూఱు యజ్ఞములను జేసిన
ుణ్యము నొందువాడగును సందేహము లేదు.

శ్లో॥ యోగచ్ఛే ద్ధనురాయామం స్నాతుం మీనగతేరవౌ ।
ర్వబంధవినిర్ముక్తో విష్ణోస్సాయుజ్య మాప్నుయాత్॥ ౨౦॥

తా॥ మీన సంక్రమణములో సూర్యుఁడు ప్రవేశించియుండఁగా
నుస్సు ప్రమాణమంత దూరమైనను స్నానము జేయుటకు నడచి
ెళ్లినవాడు సమస్త బంధములను విడిచి పెట్టినవాడై విష్ణులోకమును
ొందువాడగును.

శ్లో॥ త్రైలోక్యేయాని తీర్థాని బ్రహ్మాండాంతర్గతానిచ ।
ానిసర్వాణిభోశిష్య సంతిబాహ్యజలేల్పకే॥ ౨౧॥

తా॥ ఓశిష్యుఁడా! ఈబ్రహ్మాండగోళములో నున్న మూడు
ోకములయందును ఎన్ని తీర్థములు గలవో అవి యన్నియు
ూర్యుఁడు మీన సంక్రమణమునందు ప్రవేశించి యుండఁగా నితర
ులగు స్వల్ప ప్రదేశములయందుగల యుదకములలోను వ్యాపించి
యుండునని మహాత్ములు చెప్పిరి.

శ్లో॥ తావద్గర్జంతి పాపాని గర్జంతో యమశాసనే । యావన్న
ఞు తేజంతు చైత్రేస్నానం జలాశయే॥ ౨౨॥

తా॥ మీనసంక్రమణమునందు సూర్యుఁడు ప్రవేశించియుండఁగా నిట్టి ఫలము కలదు కాఁబట్టి చైత్రమాసములో చెరువులు మొదలగు వానిలోఁగల జలములయందైనను స్నానము నెవ్వఁడు చేయఁడో వాని పాపములను యముని యొక్క యాజ్ఞానుసారముగా భటులు వ్రాయుదురు.

శ్లో॥ తీర్థాధిదేవతాస్సర్వా శ్చైత్రేమాసిద్విజోత్తమ । బహిర్జలంసమాశ్రిత్య సదాస్సన్నిహితాశ్శిశో॥ ౨౩॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! సమస్తతీర్థాధిపతులును చైత్రమాసములో నెచ్చటెచ్చట జలములు బహిః ప్రదేశములయందైనను గలవో అచ్చటచ్చట సమస్త ప్రదేశములను నివసించియుందురు.

శ్లో॥ సూర్యోదయంసమాశ్రిత్య యావద్షట్ఘటికావధిః । తిష్ఠంతి చాజ్ఞయావిష్ణోర్నరాణాం హితకామ్యయా॥ ౨౪॥

తా॥ విష్ణుమూర్తి యొక్క యాజ్ఞానుసారముగా మనుష్యుల యొక్క మేలుకొఱకు చైత్రమాసములో సూర్యోదయమైనది మొదలారుఘడియల పర్యంతము జలాశయములందు తీర్థాధిదేవతలుందురు.

శ్లో॥ తతాప్రత్యకుర్వతాం స్నానం శాపందత్వా సుదారుణం స్వస్థానంయాంతిభోశిష్య తస్మాత్స్నానం సమాచరేత ॥ ౨౫॥

తా॥ అంతపర్యంతము నెవ్వరు స్నానము జేయకుందురో అంతవఱకు నిరీక్షించి వారికి కఠినమగు శాపమునిచ్చి వారి స్వస్థానమునకేగుదురు. కాఁబట్టి యోశిష్యుఁడా! సమస్త ప్రయత్నములచేతను చైత్రమాసములో సూర్యుఁడు మీనసంక్రమణములో నున్నప్పుడు స్నానము జేయవలెను.

మూ॥ నహిచైత్రసమోమాసో నకృతేనసమంయుగం । నచవేదసమంశాస్త్రం నతీర్థం గంగయాసమమ్॥ ౨౬॥

తా॥ చైత్రమాసముతో సమానమైన మాసము కృతయుగముతో సమానమైన యుగము వేదముతో సమానమైన శాస్త్రము గంగానదితో సమానమైన తీర్థ మెందునులేదు.

మూ॥ నజలేనసమందానం నసుఖం భార్యయా సమం । నహి తీర్థసమంలోకే పవిత్రం కవయోవిదుః॥ ౨౭॥

తా॥ జలదానముతో సమానమగు దానము భార్యవల్లకలిగే సుఖముతో సమానమగు సుఖము, పుణ్యతీర్థములతో సమానమగు పవిత్ర ప్రదేశమును లేదు.

మూ॥ తస్మాదయంచైత్రమాస శ్శైవశాయిప్రియస్సదా । అవ్రతేన నయేద్యస్తు చండాలశ్చసజాయతే॥ ౨౮॥

తా॥ అందువల్ల యీ చైత్రమాస మెల్లప్పుడు విష్ణుమూర్తికి ప్రీతికరమైనది. కాబట్టి యెవ్వడీచైత్రమాస వ్రతము నాచరించడో అట్టివాడు చండాలుడై పుట్టునని మునీశ్వరులు చెప్పిరి.

మూ॥ యథాగృహంసర్వగుణోపపన్నంపరిచ్ఛదైర్హీనమశోభతేయథా । యథైవకన్యా సకలైస్సులక్షణైర్యుక్తాపిజీవత్పతిలక్షణోజ్ఝితా॥ ౨౯॥ శాకంతుయద్వల్లవణేన హీనం నశోభతే సర్వగుణోపపన్నం । యథాలలామైః కుసుమైశ్చభాసతేవస్త్రేణ హీనాలలనాచశిష్య॥ ౩౦॥ తథాన్యమాసేషుకృతో హిధర్మశ్చైత్రేణ హీనశ్చవృథైవజాయతే॥ ౩౧॥

తా॥ సమస్తలక్షణములతో గూడినదైనను పైకప్పులేని గృహమువలెను, సౌందర్యము మొదలగు సమస్తలక్షణములు కలదైనను, పెనిమిటిలేనట్టి విధవస్త్రీవలెను, ఇతరమగు సమస్త రుచులు కలదైనప్పటికి ఉప్పువేయనట్టి కూరవలెను, అందముగాను సువాసనగానున్నట్టి విశేషమగు పుష్పముల నలంకరించుకొనిన దైనప్పటికిని శుభ్రమగు వస్త్రము లేని స్త్రీవలెను, ఇతర మాసములలో నెన్ని ధర్మముల నాచరించినప్పటికిని చైత్రమాస ధర్మము నాచరింపకున్న యెడల నిష్ఫలమగును.

మూ॥ తస్మాత్సర్వప్రయత్నేన యేనకేనాపిదేహినా । చైత్రమాసస్యయో ధర్మః కర్తవ్య ఇతినిశ్చయః॥ ౩౨॥

తా॥ అందువల్ల యే మనుష్యుడైనను సమస్తప్రయత్నముల

చేతను చైత్రమాస ధర్మము నాచరింపవలయునని దృఢముగా నిశ్చయించుకొనవలెను.

మూ॥ ననందసూనోః పృథగస్తిరామో నరామత్తోన్యో వసుదేవసూనుః । అతస్త్వయోధ్యా పురపాలకస్య చైత్రేతుకార్యంవిధివత్ప్రపూజనమ్॥ ౩౩॥

తా॥ శ్రీకృష్ణభగవానులుకంటె శ్రీరామచంద్రమూర్తి వేరుకాదు. శ్రీరామచంద్రమూర్తికంటెను శ్రీకృష్ణభగవానులు భిన్నుడుకాడు. ఉభయుల స్వరూప మొక్కటేయైనది కాబట్టి అయోధ్యాపట్టణమును పాలించునట్టి శ్రీరామచంద్రమూర్తి యొక్క పూజను చైత్రమాసములో యథావిధిగా జేయవలెను.

మూ॥ జానకీకాంత ముద్దిశ్య మీనసంస్థే దివాకరే । ప్రాతః స్నాత్వా జపేద్రామ మన్యథానరకం వ్రజేత్॥ ౩౪॥

తా॥ సూర్యుడు మీనసంక్రమణమును ప్రవేశించి యుండగా చైత్రమాసములో ప్రాతఃకాలమందు స్నానముజేసి శ్రీరామమంత్రమును జపించవలయును. అట్లుచేయనియెడల నరకమునుబొందును.

మూ॥ చైత్రమాసోహిసకల స్సీతారాఘవదైవతః । యద్యత్కర్మహితత్సర్వం తముద్దిశ్యచరేన్నరః॥ ౩౫॥

తా॥ చైత్రమాసము నెలదినములును సీతారాములే అధిదేవతలు కాబట్టి యీ నెలదినములును ఏకర్మను జేసినప్పటికిని ఆసీతారాముల్లను గుఱించియే చేయవలయును.

మూ॥ జానకీకాంత హేరామ చైత్రే మీనగతేరవౌ । ప్రాతస్స్నానం కరిష్యామి నిర్విఘ్నంకురురాఘవ॥ ౩౬॥

తా॥ చైత్రమాసములో సూర్యుడు మీనసంక్రమణమునందు ప్రవేశించియుండగా స్నానమును జేయదలచిన మనుష్యుడు సీతాదేవికి భర్తయగు నోరామా! యీ నెలదివసములును ప్రాతఃకాలమందు స్నానమును జేసెదను కాబట్టి విఘ్నములుకలుగకుండా జేయుమని సంకల్పముజేసి ప్రారంభించవలయును.

మూ॥ చైత్రేద్యమీనగేభానౌ ప్రాతస్నానపరాయణః।అర్ఘ్యం తేహం ప్రదాస్యామి గృహాణరఘునాయక॥ ౩౭॥

తా॥ ఓ శ్రీరామమూర్తీ! చైత్రమాసములో మీనరాశి యందు సూర్యుఁడు ప్రవేశించియుండెను. కాఁబట్టి నేను ప్రాతఃకాల మందు స్నానముజేయుచు నీకు నర్ఘ్యము నిచ్చుచున్నాను గ్రహించవలయును.

మూ॥ గంగాద్యాస్సరితస్సర్వాః స్తీర్థాని జలదానదాః। ప్రతి గృహ్యామయాదత్త మర్ఘ్యాం సమ్యక్ప్రసీదథ॥ ౩౮॥

తా॥ గంగాది సమస్త నదులును ఇతర సమస్త తీర్థములును సరస్సులును మిమ్ముల గుఱించి అర్ఘ్యము నిచ్చుచున్నాను కాఁబట్టి గ్రహించి అనుగ్రహింపుడు.

మూ॥ బ్రహ్మాద్యాస్సరితస్సర్వా ఋషయోయేచ వైష్ణవాః। తేగృహ్ణంతు మయాదత్త మర్ఘ్యాంసమ్యక్ప్రసీదథ॥ ౩౯॥

తా॥ బ్రహ్మ మొదలగు సమస్త నదులారా! విష్ణుభక్తిగల యోమునీశ్వరులారా! నేనిచ్చునట్టి యర్ఘ్యమును గ్రహించి యను గ్రహింపుడు.

మూ॥ ఋషయఃపాపినాంశాస్తా యమత్వంసమదర్శనః। గృహా ణార్ఘ్యంమయాదత్తం యథోక్తఫలదోభవ॥ ౪౦॥ ఇతి చార్ఘ్యం సమర్పాథపశ్చాత్స్నానం సమాచరేత్ ॥

తా॥ ఓ మునీశ్వరులారా! పాపాత్ములను శిక్షించునట్టియు సమస్తభూతములయందును సమదృష్టి కలిగియున్నట్టి యో శ్రీరామ మూర్తీ! నేనిచ్చునట్టి యర్ఘ్యమును గ్రహించి అందుకు తగిన ఫలమునిమ్ము అని యర్ఘ్యమునిచ్చి యనంతరము తిరిగి స్నానమును జేయవలయును.

మూ॥ వాససీపరిధాయాథ కృత్వా కర్మాణిసర్వశః ॥ ౪౧॥ జానకీకాంత మభ్యర్చ్య ప్రసూనైర్మధు సంభవైః। శ్రుత్వా రామ కథాం దివ్యా మేతన్మాసప్రశంసినీం॥ ౪౨॥ కోటిజన్మార్జితాత్పాపా న్ముక్తో మోక్షమవాప్నుయాత్॥ ౪౩॥

తా॥ అనంతరము పరిశుభ్రములగు వస్త్రములను ధరించి సంధ్యావందనాది నిత్యకర్మలనన్నియుజేసి చైత్రమాసములో నుద్భవించునట్టి పుష్పములచే సీతారామమూర్తిని బూజించి శ్రేష్ఠమైనదియు చైత్రమాసమాహాత్మ్యముగూడ కలిగియున్నట్టి శ్రీరామచరిత్రమును వినవలయును. ఇట్లు చేసినయెడల కోటిజన్మములయందు జేసినట్టియు పాపములవల్లను విడువబడి మోక్షమునుపొందును.

మూ॥ చైత్రేయఃకాంస్యభోజీ హితథాప్రశుతసత్కథః। నస్నాత శ్చాప్యదాతాచ నరకానేవవిందతి॥ ౨౨॥

తా॥ చైత్రమాసములో కంచు పాత్రియందు భుజియించువాడును, శ్రీరామచరిత్రము మొదలగు సత్కథలను విననివాడును, ప్రాతఃకాలమందు స్నానముజేయనివాడును, దానధర్మములనుజేయనివాడును, రౌరవాది నరకములనొందును.

మూ॥ యథామాఘః ప్రయాగేహి స్నాతవ్యస్సుఖమిచ్ఛతా। కార్తికోపితథాకాశ్యాం పంచగంగాజలేస్మృతః॥ ౨౩॥ ద్వారకాయాం యథాప్రోక్తో వైశాఖో మాధవప్రియః। అయోధ్యాయాం రామతీర్థే తథాచైత్రఃప్రకీర్తితః॥ ౨౪॥

తా॥ సౌఖ్యముల నపేక్షించు నరుడు మాఘమాసములో ప్రయాగయందు స్నానముజేసినట్టి ఫలమును, కార్తికమాసములో కాశిక్షేత్రమందు పంచ గంగలు కలసిన ప్రదేశమునందు స్నానము జేసినఫలమును, విష్ణుమూర్తికి ప్రీతికరమగు వైశాఖమాసములో ద్వారకయను క్షేత్రమునందు స్నానమునుజేసిన ఫలమును ఎట్లు సంభవించునో ఆవిధముగానే చైత్రమాసములో అయోధ్యాపట్టణమునందు గల రామతీర్థమునందు స్నానముచేసిన యెడల నట్టి ఫలము నొందుదురు.

మూ॥ ప్రయాగే మాసమాత్రేణ యత్ఫలం ప్రాప్యతే నరైః। అయోధ్యాయాం రామతీర్థే సకృత్ స్నానేన తత్ఫలమ్॥ ౨౫॥

తా॥ ప్రయాగయందు నెలదినములును మనుష్యులు స్నానము జేసిన యెడల నే ఫలమునొందుదురో అయోధ్యాపట్టణమునందుండు

రామతీర్థమములో నొక్క పర్యాయము స్నానముజేసినయెడల నాఫలము నొందుదురు.

మూ॥ వైశాఖద్వాదశీభవం పుణ్యం యద్గోమతీజలే । తత్పుణ్యం సరయూతోయే యోధ్యాయాం ప్రాప్యతే నరైః॥

తా॥ గోమతీ నదీ జలములయందు వైశాఖమాస ద్వాదశీ దినమున స్నానముజేసిన యేఫలము సంభవించునో అయోధ్యాపట్టణమునందు గల సరియూనదిలో స్నానముజేసిన ఆఫలముగలుగును.

మూ॥ చైత్రమాసి త్రిభిఃస్నానైః రామతీర్థేనసంశయః॥ ౧౮॥

తా॥ చైత్రమాసములో రామతీర్థమునందుమూఁడుదినములు స్నానముజేసిన విశేషఫలముకలుగును.

మూ॥ కార్తికేపంచగంగాయాం యేస్నానం ద్వాదశాబ్దకం। అయోధ్యాయాం రామతీర్థే చైత్రేపక్షేణ తత్ఫలమ్॥ ౧౯॥

తా॥ పండ్రెండు సంవత్సరములు కార్తికమాసములో పంచగంగా క్షేత్రమునందు స్నానముజేసిన యేఫలము కలుగునో అయోధ్యాపట్టణమునందు గల రామతీర్థమునందు చైత్రమాసములో పదియేను దినములు స్నానముజేసిన యాఫలము నొందును.

మూ॥ అయోధ్యా దుర్లభా లోకే నరాణాం పాపకారిణాం । తావద్గర్జంతి పాపాని యావద్దృష్టా ననా పురీ॥ ౨౦॥

తా॥ పాపాత్ములగు నరులకు అయోధ్యాపట్టణము జేరుటయే సంభవింపదు. అయోధ్యాపట్టణము దర్శనమగు నంతవఱకును పాపాత్ముల పాపములు ఘూపించుచుండును.

మూ॥ అయోధ్యాయాం తథాభావ్యా తథారామకృతానిచ । జగత్యాంరామతీర్థాని తత్రస్నానం విధీయతామ్॥ ౨౧॥

తా॥ అయోధ్యాపట్టణమునందు ఎట్టిగౌరవముకలదో శ్రీరామకృత్యములయందును అట్టి గౌరవముకలదు కాఁబట్టి ప్రపంచమునందు గల రామతీర్థములయందు స్నానముజేయవలెను.

మూ॥ యత్రాయోధ్యాపురీనాస్తి స్నానార్థంసరయూర్నచ । రామతీర్థంనయత్రాస్తి తదాతీర్థేషు కారయేత్॥ ౨౨॥

తా॥ అయోధ్యాపట్టణములేని ప్రదేశమునందును స్నానము జేయుటకు సరయూనదిలేని ప్రదేశమునందును రామతీర్థములేని ప్రదేశమునందును ఇతర క్షేత్రములయందు స్నానాదులను జేయ వలయును గాని సరయూనదులు మొదలగు పైనచెప్పఁబడినవి సంభ వించిన యెడల వాటినే సేవింపవలయును.

మూ॥ తైలాభ్యంగం దివా స్వాపం తథాకాంస్యభోజనం। ఖట్వానిద్రాం గృహేస్నానం నిషిద్ధస్యచ భక్షణమ్॥ ౫౬॥ చైత్రేతు వర్జయేదష్టౌ ద్విభుక్తం నక్తభోజనమ్॥

తా॥ నూనెతో తలంటుకొనుటయు, పగలునిద్రించుటయు, కంచుపాత్రలో భుజించుటయు, మంచముమీఁద నిద్రించుటయు, ఇంటివద్ద స్నానము జేయుటయు, నిషేధింపబడిన వస్తువులను తిను టయు, రెండు పర్యాయములు భుజించుటయు, పగలు మాని రాత్రి యందు భుజించుటయు, ఈయెనిమిది కృత్యములను చైత్రమాసములో విడువవలెను.

మూ॥ చైత్రేమాసేతుమధ్యాహ్నే శ్రాంతానాంతు ద్విజన్మ నాం। పాదావనేజనంకుర్యా త్తద్వ్రతంతువ్రతోత్తమమ్॥

తా॥ చైత్రమాసములో మధ్యాహ్న సమయమునందు ఆయా సము నొందియున్నట్టి బ్రాహ్మణులకు చల్లనినీళ్లతో పాదప్రక్షాళన జేయవలయును. ఈవ్రతము చాలా శ్రేష్ఠమైనదిగాఁజెప్పఁబడెను.

మూ॥ మార్గేతుయాయినాంమర్త్యో ప్రపాదానంచచైత్రకే। మార్గేఛాయాంతుయఃకుర్యా త్సస్వర్గేపిమహీయతే॥ ౫౬॥

తా॥ చైత్రమాసములో ప్రయాణముజేయు మార్గస్థులకు చలి వేంద్రవేయించి యుదకము నిచ్చుటయు నెండగల ప్రదేశము యందు నీడగా నుండుటకు పందిళ్లువేయించుటయు మొదలగు కార్య ములను జేసినవాఁడు స్వర్గలోకములో నివసించువాఁడగును.

శ్లో॥ సలిలంసలిలాకాంక్షీ ఛాయాంఛాయేప్సురాదాదరాత్ వ్యజనం వ్యజనాకాంక్షీ దానమేతత్తుచైత్రకే॥ ౫౭॥ జలంఛత్రంతు వ్యజనం దానం మానే విశిష్యతే॥ ౫౮॥

తా॥ జలము కోరినవారికి జలమును, నీడను కోరినవారికి నీడయు, విశనకఱ్ఱలు కావలసినవారలకు విశనకఱ్ఱల నిచ్చుటయు ముఖ్యమైనది కాఁబట్టి చైత్రమాసములో జలము గొడుగు విశనకఱ్ఱ నీడ మొదలగు వాటినిచ్చుట ముఖ్యమైనది. అందులోను మీన సంక్రమణము కలిసియున్న దినములయందు మిక్కిలిముఖ్యము.

మూ॥ చైత్రే మాసేతుసంప్రాప్తే బ్రాహ్మణాయకుటుంబినే। అదత్వోదకకుంభంతు చాతకోభువిజాయతే॥ ౨౯॥

తా॥ చైత్రమాసములో కుటుంబవంతుడగు బ్రాహ్మణునకు జల యుక్తముగా కలశ దానము జేయనివాఁడు భూమిలో చాతక పక్షిగాఁబుట్టును.

మూ॥ చైత్రేదేయంజలంచాన్నం దేయాశయ్యామనోరమా। ఆదర్శదానం తాంబూలం గుడదానంప్రకారయేత్॥ ౩౦॥

తా॥ చైత్రమాసములో జనము, అన్నము, సుందరమగుశయ్య, అద్దము, తాంబూలము, బెల్లము, మొదలగు వానిని దానమియ్య వలయును.

మూ॥ గోధూమం తువరీదానం దానందధ్యోదనస్యచ। ఘృత యుక్తం కాంస్యపాత్ర దానమిక్షురసస్యచ॥ ౩౧॥ తథాశ్రీఫలదానంచ దానం చూతఫలస్యచ। సూక్ష్మమంచకయోః పాన పాత్రం కమం డులుమ్॥ ౩౨॥ యతీనాం దండదానంచ తైలదానం మఠేషుచ। జీర్ణోద్ధార మఠానాంచ ఘంటానాం కరణంతథా॥ ౩౩॥ ప్రాసాద కరణంచైవ వాపీకూపాదికం తథా। మార్గస్థానాం ఛత్రదానం మధ్యాహ్నే తిథిపూజనమ్॥ ౩౪॥ కరపాత్రంయతీనాంచ గోగ్రాసంతు గవామపి। ఏతానిచైత్రమాసేతు దానాని కథితానిహి॥ ౩౫॥

తా॥ గోధుమలును, ఇతర ధాన్యజాతులను, పెరుగుతోకూడి యుండు నన్నమును, నెయ్యితోగూడిన కంచుపాత్రను, చెరకురస మును, ఉశిరికపండ్లను, మామిడిపండ్లను, చిన్నమంచములను, దాహా ముత్రాగుటకు పాత్రను, కమండలమును, యతీశ్వరులకు దండమును, సత్రములలో దీపములను వెలిగించు కొనుటకు నూనెయు, దానము

లను చేయవలయును. మఱియు చెడిపోయిన మఠములను బాగు చేయించుటయు, ఘంటలను కట్టించుటయు, దేవాలయములను కట్టించుటయు, నూతులు, చెరువులు, దిగుడుబావులు మొదలగు వానిని త్రవ్వించుటయు, మార్గమునందు నడచువారికి గొడుగుల నిచ్చుటయు, మధ్యాహ్నకాలమందు నతిథులను బూజించి యన్నముపెట్టుటయు, యతీశ్వరులకు కమండలముల నిచ్చుటయు, ఆవులకు మేత వేయుటయు, ఈ మొదలగు సత్కార్యములను చైత్రమాసములో చేసినందువల్ల ఫలము కలుగునని చెప్పఁబడెను.

మూ॥ ఫలంశాకంతు మూలంచ కందంపుష్పంతు చందనం। ఉశీరశ్శీతలం ద్రవ్యం కస్తూరీం కర్పూరం తథా॥ ౬౬॥ దీపదానం ధేనుదానం గేహదానం తథాస్మృతం। గోరసానాం పృథగ్దానం యతి బ్రాహ్మణ భోజనమ్॥ ౬౭॥ సువాసినీపూజనంచ రామనామ ప్రిలేఖనం। పుస్తకానాం తథాదానం తథా కుంకుమ కేసరీమ్॥ ౬౮॥ జాతీఫలం లవంగాశ్చ జాతీపత్రవరాంగణే। ధాతకీనాగరం ధూపం బీజపూరం కళింగకమ్॥ ౬౯॥ జంబీరం పనసంచైవ కపిత్థం మాతులుంగకం। కూశ్మాండదానమారామ కరణం మార్గశోధనమ్॥ ౭౦॥ తథో పానహదానంచ గజవాజిభవం తథా। ఏతాని చైత్రమాసేతు దానానికథితానిహి॥ ౭౧॥

తా॥ పండ్లు, కూరలు, దుంపలు, పుష్పములు, మంచిగంధము, వట్టివేళ్లు, చల్లనివస్తువులు, కస్తూరి, కర్పూరము, దీపము, ఆవు, గృహము, ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుపెరుగు మొదలగు వానిని దాన మియ్యవలయును. యతీశ్వరులకు బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును. సువాసినీ స్త్రీలను పూజించవలయును. రామకోటి వ్రాయవలయును. పుస్తకములను కుంకుమపువ్వులను జాజికాయలు లవంగములు ఏలకులు జాజిపత్రి మొదలగు వస్తువుల నియ్యవలయును. గైరికాది ధాతువులను సొంఠి గుగ్గిలము మాదీఫలము కమలాఫలము నిమ్మపండ్లు పనసపండ్లు వెలగపండ్లు అడవిమాజీఫలములు గుమ్మడి పండ్లు మొదలగు వానిని దానమియ్యవలయును. తోటలు వేయించ

వలయును. మార్గములో ముండ్లు రాళ్లు మొదలగునవి లేకుండా భాగుచేయించవలయును. పాదుకలు ఏనుగులు గుఱ్ఱములు మొదలగు వానిని దాన మియ్యవలయును. ఈ మొదలగు సత్కార్యములను జేయవలయునని చెప్పఁబడెను.

మూ॥ యానిచైత్రేతు వర్జ్యాని తానితేతు వదామ్యహం। సర్వాణ్యేతాని మాంసాని క్షౌద్రం సౌవీరకంతథా॥ రాజమాషాదికం చాపి చైత్రస్నాయీ ప్రవర్జయేత్॥ ౭౨॥

తా॥ సమస్త మాంసములను తేనె కడుగునీళ్లు బొబ్బర్లు మొదలగు వస్తువులను చైత్రమాస వ్రతము నాచరించువాఁడు విడువవలయును.

మూ॥ పరాన్నంచపరద్రోహం పరదారాగమంతథా। తీర్థఘ్నాని సదైవేహ చైత్రస్నాయీప్రవర్జయేత్॥

తా॥ ఇతరులయన్నము భుజియించుట, యితరులకు ద్రోహము చేయుట పరునిభార్యా సంగమముచేయుట యిట్టి కృత్యములు దుష్టకృత్యములు కాఁబట్టి చైత్రమాసములో ప్రాతఃకాలమందు స్నానము జేయునట్టివాఁడు విడువవలయును.

మూ॥ ద్విదళం తిలతైలంచ తథాన్నం శల్యదూషితం। భావదుష్టం శబ్దదుష్టం చైత్రస్నాయీతు వర్జయేత్॥ ౭౪॥

తా॥ రెండు దళములతోనుండి బాగావికసించని వస్తువులును నూనెయు యెముకలు మొదలగువాని సంపర్కము కలిగిన యన్నము తన మనస్సున కిష్టములేని పదార్థము వాక్కుచేత నిషేధింపఁబడిన పదార్థమును చైత్రమాసవ్రతమునాచరించువాఁడువిడువవలయును.

మూ॥ దేవవేదద్విజానాంచ గురుగోవ్రతినాంతథా। స్త్రీరాజమహాతాంనిందాం చైత్రస్నాయీ వివర్జయేత్॥ ౭౫॥

తా॥ దేవతలు వేదము బ్రాహ్మణులు గురువులు గోవులు వ్రతముజేయువారు స్త్రీలు రాజు మహానుభావులు యీ మొదలగు వారిని చైత్రస్నానముజేయువాఁడు విడిచిపెట్టవలయును.

మూ॥ ప్రాణ్యంగమాంసచూర్ణం ఫలేజంబీరమాంసం । ధాన్యేమసూరికాప్రోక్తా చాన్నంపర్యుషితంతథా॥ ౭౬॥

తా॥ ప్రాణులయొక్క యవయవములను మాంసమును చూర్ణమును నేరేడుపండ్లను కొఱ్ఱలు చెడిపోయిన యన్నమును తినకూడదు.

మూ॥ బ్రహ్మచర్య మథస్సుప్తిః పత్రావళ్యాంచ భోజనం । చతుర్థకాలే భుంజీత కుర్యాదేవం సదావ్రతీ॥ ౭౭॥

తా॥ బ్రహ్మచర్య వ్రతము నాచరించుటయు భూమిమీద పరుండుటయు విస్తరిలో భుజించుటయు అపరాహ్ణకాలమందు భుజించుటయు చైత్రమాసవ్రతము నాచరించువాఁడు జేయవలయును.

మూ॥ సంవత్సరప్రతిపది తైలాభ్యంగంతుకారయేత్ । చైత్రస్నాయీ నరోన్యత్ర తైలాభ్యంగం నకారయేత్॥ ౭౮॥

తా॥ చైత్రమాస స్నానవ్రతము నాచరించువాఁడు చైత్రశుద్ధపాడ్యమియందు తప్ప మిగత దినములయందు నూనెతో తలంటుకొనకూడదు.

మూ॥ ఆలాబూంచాపివృంతాకం కూశ్మాండం బృహతీఫలం । శ్లేష్మాతకం కళింగరిచ కపిత్థంచైవవర్జయేత్॥ ౭౯॥

తా॥ సొరకాయి వంకాయి గుమ్మడికాయి ములగకాయి విరిగిచెట్టుయొక్క కాయలు కళింగదేశమునందుగల వెలగపండ్లు విడువవలయును.

మూ॥ రజస్వలాంత్యజమ్లేచ్ఛ పతితైః పాతకైస్సహ । ద్విజద్విడ్వేద బాహ్యైశ్చనవదేత్సర్వదావ్రతీ॥ ౮౦॥

తా॥ రజస్వలైన స్త్రీలు చండాలురు మ్లేచ్ఛులు వర్ణసంకరులు పాపాత్ములు బ్రాహ్మణులను నిందించువారు వేదబాహ్యులు నీ మొదలగువారితో వ్రతములు బూనినవాఁడెప్పుడును మాట్లాడఁకూడదు.

మూ॥ పలాండుం లశునంచైవ ఛత్రాకం గృంజనం తథా । నాళికామూలకంశిగ్రుం చైత్రస్నాయీ వివర్జయేత్॥ ౮౧॥

తా॥ నీరుల్లి వెల్లుల్లి పుట్టగొడుగులు విషముతిన్న పశువు యొక్క మాంసము తామరదుంప ములగగింజలు మొదలగువానిని చైత్రమాసస్నానము జేయువాడు విడువవలయును.

శ్లో॥ ఏభిస్స్పృష్టంచ కాకైశ్చ సూతకాన్నంచ వర్జయేత్ । ద్విపాచితంచ దగ్ధాన్నం చైత్రస్నాయీ వివర్జయేత్॥ ౨౨॥

తా॥ పైనచెప్పఁబడిన వస్తువులతోటి కాకులతోటి ముట్టుకొనబడిన యన్నము మైలగలవారి యన్నము రెండుపర్యాయములు వండబడిన యన్నము మాడినయన్నమును తినగూడదు.

శ్లో॥ ఏతాని వర్జయేన్నిత్యం వ్రతీసర్వత్రతేష్వపి । కృచ్ఛ్రాద్యంచ ప్రకుర్వీత స్వశక్త్యారామతుష్టయే॥ ౨౩॥

తా॥ యీపైనచెప్పఁబడిన పదార్థములు నిత్యము విడిచిపెట్టతగినవి. చైత్రమాసవ్రతము నాచరించువాఁడు ముఖ్యముగా విడువవలయును. అట్లు విడువక భుజించినయెడల తనశక్తికొలది కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తములను జేసిన యెడల శ్రీరామచంద్రమూర్తికిఁ బ్రీతి యగును.

శ్లో॥ క్రిమాతుష్కూష్మాండబృహతీ ఛత్రాకం మూలకంతథా । శ్రీఫలంచ కళింగంచ ఫలంధాత్రీ భవంతథా॥ ౨౪॥ నారికేళ ఫలాబూంచ పటోలం బదరీఫలం। చర్మవృంతాకకం వల్లీ శాకం తులసిజం తథా॥ ౨౫॥ శాకాన్యేతాని వర్జ్యాని క్రిమాత్ప్రతిపదాదిషు॥ ధాత్రీ ఫలంరవౌతద్వ ద్వర్జయేత్సర్వదాగృహీ॥ ౨౬॥

తా॥ గుమ్మడికాయ, ములగకాయ, పుట్టగొడుగు, ముల్లంగి, మాదీఫలము, కళింగమను ఒకానొకవక్షి, ఉశిరికాయ, కొబ్బరికాయ, సొరకాయ, పొట్లకాయ, రేగుపండ్లు, దుంపలు, వంకాయ, తీగయందు కలుగుకూర, తులసిని యీచెప్పఁబడిన వస్తువులను పాడ్యమి మొదలు పదునేను దినములయందుఁగ్రమముగా విడువవలయును. గృహస్థుఁడు ఉశిరికఫలములను ఆదివారమునాఁడు తప్పక విడువవలయును.

శ్లో॥ ఏభ్యోన్యద్వర్జయే త్కించి త్తదారామ ప్రీతయే నరః దత్వావ్రతాంతే విప్రాయ భక్షయే త్సర్వదైవహి॥ ౨౭॥

తా॥ పిట్లకంటె నితరమగు వస్తువులను విడువవలయును. ఇట్లు చేసిన శ్రీరామచంద్రమూర్తికి సంతోషకరమగును. ఇట్లు వ్రతము పూర్తియైన పిమ్మట ఆ నిషేధింపఁబడిన వస్తువులను మఱందుగా బ్రాహ్మణులకు దానమిచ్చిన మొదల తర్వాత ఆదీక్ష నవలంబించిన నరుఁడు భుజియింపవచ్చును

శ్లో॥ ఫాల్గునీపూర్ణిమామారభ్య యావచ్చైత్రీతు పూర్ణిమా । చైత్రస్నానంతు తావద్ధి నరైః కార్యంతు భక్తితః ॥

తా॥ ఫాల్గుణశుద్ధ పౌర్ణమి మొదలు చైత్రశుద్ధ పౌర్ణమి పర్యంతము నరుఁడు భక్తికలవాఁడై చైత్రమాస స్నానముఁ జేయ వలయును.

శ్లో॥ అథవామీనగేభానౌ యావత్తావత్ప్రకారయేత్ । దశమీం ఫాల్గునీంశుద్ధాం సమారభ్యమథోస్సితా॥ యావద్భవేత్తుదశమీ తావత్స్నానం ప్రకారయేత్ ॥ ౧౯॥

తా॥ లేక సూర్యుఁడు మీనరాశియందుండు నంతవఱకు స్నానముఁ జేయవలయును. లేక ఫాల్గున శుద్ధ దశమి మొదలు చైత్ర శుద్ధ దశమి పర్యంతము స్నానము జేయవలయుననిరి.

శ్లో॥ స్నానస్యైతే త్రయోభేదా శ్చైస్యైతేసముదీరితాః। చైత్ర శుక్ల తృతీయాయా యావద్వైశాఖసంభవా॥ తృతీయాశుక్లపక్షస్య హ్యక్షయ్యేతి స్మృతాత్రయా॥ ౨౦॥

తా॥ ఈప్రకారము మూఁడువిధములుగా స్నానమును గుఱించి చెప్పఁబడియున్నది. మఱియు చైత్ర శుక్లతదియ మొదలు వైశాఖ శుక్లతదియ పర్యంతము అక్షయ్యమని చెప్పఁబడెను.

శ్లో॥ తావచ్చ సీతలాగారీ స్నాతవ్యా సుఖలబ్ధయే । సీతా తీర్థేతు నారీభిః పూజనీయాతుజానకీ॥ ౨౧॥

తా॥ అంతపర్యంతము సీతలాగారిని గుఱించి సంతృప్తికొఱకు స్నానము చేసిన సుఖములనొందుదురు. కాఁబట్టి సీతాతీర్థమునందు స్త్రీలు స్నానముచేసి సీతాదేవిని పూజింపవలయును.

శ్లో॥ తృతీయాయాతు చైత్రస్య సితపక్షోద్భవాతథా। వైశాఖ శుక్లపక్షేయా తృతీయాక్షయ సంజ్ఞితా॥ ౯౨॥

తా॥ చైత్రశుక్లపక్ష తదియయు వైశాఖశుక్లపక్ష తదియయు అక్షయతదియ యని చెప్పఁబడును.

శ్లో॥ నారీయాశీతలాగౌరీ వ్రతస్నాన పరాయణా। అభ్యంగం సాకరోత్యేత త్తిథోర్న్నస్యదినేకదా॥ ౯౩॥

తా॥ శీతలాగౌరీవ్రతము చేయుటకు ప్రారంభించిన స్త్రీ స్నానము చేయుచు చైత్ర శుక్ల తదియయందును వైశాఖ శుక్ల తదియయందును అభ్యంగనమును జేయవలయును గాని మఱియొక దినమందు అభ్యంగనమును జేయఁగూడదు.

శ్లో॥ త్రింశచ్చ తిథయఃపుణ్యా శ్చైత్రమాసే మహత్తమాః। తథాపి హి విశేషోత్ర తిథీనాంవర్ణ్యతేమయా॥ ౯౪॥

తా॥ చైత్రమాసములో ముప్పదిదినములు విశేషమగు పుణ్యప్రదమైనది. అందులోను ఈఅక్షయ తదియలను నవి మిక్కిలి పుణ్యప్రదమైనవి.

శ్లో॥ చైత్రమాసే కృష్ణపక్షే పంచమీదశమీతథా। ఏకాదశీ ద్వాదశీచ శివరాత్రి స్తథామాతథా॥ ౯౫॥ ఏతాశ్శుభా శ్చైత్రకృష్ణే మహాపాతకనాశనాః॥ ఇదానీం చైత్రమాసస్య సితపక్షోద్భవాశ్శుభాః॥

తా॥ చైత్రమాసములో బహుళపక్షమునందు పంచమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, మాసశివరాత్రి, అమావాస్య యీ ఆరు తిథులును చాలా మంచితిథులు. సమస్త పాపములను పోగొట్టును. అయిన నిప్పుడు శుక్లపక్షములో నుండు తిథులు శుభప్రదములుగాఁ జెప్పఁబడెను.

శ్లో॥ వర్ణ్యంతే తిథయశ్శ్రేష్ఠా నరాణాం హితకామ్యయా। సంవత్సరప్రతిపద మారభ్య దశమీదినమ్॥ ౯౬॥ యావత్తావచ్చుభా స్సర్వా స్నానదానాదికర్మణి॥

తా॥ మనుష్యులకు శ్రేయస్సు కలుగగలందులకు శ్రేష్ఠమగు తిథులు చెప్పఁబడుచున్నవి. అవి యేవనఁగా సంవత్సరాది పాడ్యమి

మొదలు దశమి పర్యంతము నుండు తిథులు శుభప్రదమైనవి కాఁబట్టి ఆ తిథులయందు స్నానము దానము మొదలగు కర్మలు చేసినందు వలన విశేషపుణ్యము కలుగును.

శ్లో॥ యత్కృతంచ ప్రతిపది స్నానదాన వ్రతాదికమ్॥ ౯౮॥ ద్వితీయాయాంచ తత్ప్రోక్తం ద్విగుణం నాత్రసంశయః। యత్కృతంచ ద్వితీయాంచ భక్త్యాస్నానాదికం నరైః॥ ౯౯॥ ద్విగుణం తత్తృతీయాయాం చైత్రమాసేనరోత్తమ। ఏవం సర్వాసుతిథిషు యావత్స్యాన్నవమీశుభా॥ ౧౦౦॥ ఏవం విశేషోజ్ఞాతవ్యో యథాదాప్రిదిక్షుచర్వణాత్॥

తా॥ పాడ్యమియందు స్నానము దానము వ్రతము మొదలగునవి చేసినందువలన యేఫలము కలుగునో ద్వితీయయందు చేసినందు వలన దానికి రెండు రెట్లు ఫలముకలుగును. ఇందువిషయమై యెంత మాత్రము సందేహము లేదు. విదియయందు చేసినందువలన నేమి ఫలము కలుగునో తదియయందు చేసినయెడల దానికి రెండు రెట్లు ఫలముకలుగును. ఈప్రకారము నవమి పర్యంతము నొకదానికంటె నొక తిథి యధికఫలము కలదియగును. అది యేవిధముగా ననఁగా చెరకుగడ నవిలినకొలదియు చిట్టచివఱకు నేవిధముగా రుచిగా నుండునో ఆవిధముగానే విశేషఫలము కలుగునని దెలిసికొనవలయును.

శ్లో॥ యథా క్షీరాద్దధిప్రోక్తం దధ్నస్తు నవనీతకమ్॥ ౧౦౧॥ నవనీతాద్ఘృతం యద్వత్తథా తిథివినిర్ణయః॥

తా॥ క్షీరములవలన పెరుగును, పెరుగువలన వెన్నయు, వెన్నవలన నెయ్యియు నొకదానికంటె నొకటి యేవిధముగా నెక్కువని చెప్పఁబడెనో ఆవిధముగానే తిథుల విషయమై చెప్పఁబడెను.

శ్లో॥ చైత్రమాసస్తుమాసానాం తత్రపక్షస్సితోవరః॥ ౧౦౨॥ సితపక్షే క్రమేణైవ యావత్స్యాన్నవమీతిథిః॥ తావదేకైకశః శ్రేష్ఠాః సర్వాసు నవమీవరా॥ ౧౦౩॥

తా॥ పండ్రెండు మాసములలో చైత్రమాసము శ్రేష్ఠమైనది. ఆ చైత్రమాసములో శుక్లపక్షము శ్రేష్ఠమైనది. శుక్లపక్షములోను

పాడ్యమి మొదలు నవమి పర్యంతము నొకతిథికంటె నొకతిథి విశేష మైనది. కాఁబట్టి అన్ని తిథులలోను నవమి విశేషఫలము కలది.

శ్లో॥ యస్యాంజాతంరామజన్మ ధర్మసంస్థాపనాయహి । తస్మాత్తిథిస్తుసాజ్ఞేయా కర్మనిర్మూలనక్షమా॥ ౧౦౪॥

తా॥ భగవంతుఁడగు విష్ణుమూర్తి భూలోకములో ధర్మసంస్థాపనజేయుట కొఱకు దశరథమహారాజునకు పుత్త్రుఁడుగా శ్రీరామచంద్రుఁడను నామముచే నవమితిథియందు నుద్భవించెను గాన ఆనవమితిథి సమస్తదుష్కృత్యములను నశింపఁజేయును.

శ్లో॥ తస్యాందత్తం హుతంజప్యం యత్కించిచ్ఛుభంకృతం । సర్వంతదక్షయంవింద్యా న్నాత్రకార్యావిచారణా॥

తా॥ ఆనవమియందు దానమిచ్చుట హోమముజేయుట పుట్టుట మొదలగునవి యేవిజరిగినను అటువంటి శుభకృత్యములన్నియు విశేషఫలము నిచ్చునవియగును. ఇందువిషయమై సందేహము లేదు.

శ్లో॥ ప్రతిపద్దినమారభ్య నవరాత్రముపోషయేత్ । ప్రత్యహం రఘువీరస్య పూజనం చైవకారయేత్॥ ౧౦౫॥

తా॥ పాడ్యమి మొదలు నవమి పర్యంతము శ్రీరామునియొక్క పూజను నిత్యము జేయుచు నుపవాసము జేయవలయును.

శ్లో॥ సంవత్సరప్రతిపది ధ్వజాస్స్యాధోపరిస్థితాః । దివ్యవస్త్రైశ్చ మాల్యైశ్చ మండితాశ్చ మనోరమాః॥ ౧౦౬॥ రామజన్మ సూచనార్థం ప్రీత్యర్థం రాఘవస్యచ । గృహే గృహే నరైః కార్యాః పూజనీయాశ్చ భక్తితః॥ ౧౦౭॥

తా॥ జండాలను కట్టి వాటిని శ్రేష్ఠమగు వస్త్రములతోను పుష్పమాలికలతోను నలంకరించి వాటిని సంవత్సరాది పాడ్యమి యందు తమ నివాసములగు మేడల యందుగాని గృహముల యందుగాని శ్రీరామచంద్రమూర్తికి సంతోషకరము కొఱకు గృహములకు నుపరిభాగమునందు కట్టుకొని నిత్యము భక్తితోఁ బూజించుచుండవలయును.

మూ॥ గృహే దేవాలయే వాథ గోష్ఠే బృందావనే శుభే ।
సమ్మార్జనాదికం కార్యం నిత్యం చందనవారిభిః॥ ౧౮॥

తా॥ తమ గృహములయందు దేవాలయమునందు గోవులను కట్టు ప్రదేశమునందు తులసి బృందావనమునందు మఱియే శుభ ప్రదేశమునందైనను మంచిగంధము మొదలగు సుగంధ ద్రవ్యములను కలిపిన యుదకమును నిత్యము చల్లవలయును.

మూ॥ తతః పాషాణచూర్ణైశ్చ నానాపద్మాదికానిహ । లేఖనీయాని భూమ్యాంతు నీలపీతాదివర్ణకైః॥ ౧౧౦॥

తా॥ అటుపిమ్మట నలుపు పసుపు ఎరుపు మొదలగు రాళ్లను మెత్తముగా చూర్ణముజేసి దానితో పద్మము శంఖము గోపాదము స్వస్తికము మొదలగు నాకారములుగా నీళ్లుచల్లిన యాప్రదేశముల యందు నందముగా నుండునట్లు యలంకరింపవలయును.

మూ॥ అష్టోత్తర సహస్రాఖ్యం రామతోభద్ర ముత్తమం ।
సీతాఖ్యం వాలిఖేద్భద్ర మథవాన్యన్మనోరమమ్॥ ౧౧౧॥

తా॥ వెయ్యియెనిమిది రామభద్ర చక్రములనుగాని, సీతాభద్ర చక్రములనుగాని లేక మఱియొక సుందరాకారములగు చక్రముల నలంకరింపవలయును.

మూ॥ తస్యోపరి మహాన్ రమ్య శ్చిత్రవర్ణశ్చ మంటపః ।
దేహోద్వారాణి చత్వారి కార్యాణి తోరణానిచ॥ ౧౧౨॥

తా॥ దానిపైన అనేక రంగులుగలదియు సుందరముగా నుండునట్టి యొక మంటప మేర్పఱచి దానికి నాలుగు ద్వారములు నుండునట్లుగాను నిర్మించి తోరణాదులతో నలంకరింపవలయును.

మూ॥ కదళీస్తంభ యుక్తాని ఇక్షుదండ యుతానిచ । నానా ఘంటా కింకిణీభి ర్ధ్వనితాన్యుజ్జ్వలానిచ॥ రమ్యాదర్శైర్మండలాని విచిత్రాణి శుభానిచ । నానాచిత్ర వితానైశ్చ ముక్తాహారైర్యుతానిచ॥ ౧౧౪॥

తా॥ అరటిస్తంభములు చెరకుగడలు కట్టి అనేక ఘంటలు చిరి ఘంటలుతోను మ్రోగునట్లుగా నేర్పరచి నిర్మలములగు నద్దముల

నక్కడక్కడ నుంచి చిత్రవిచిత్రములగు ముత్యాలహారముల నలంక రించి శోభస్కరములగు చాందినీలతో గూడ ఆమంటపము నలంక రింపవలయును.

మూ॥ తస్మిన్ హేమమయఃకార్యో మంచకో రత్నమండితః । తస్యోపరిమహావస్త్రై శ్శయ్యాకార్యామనోరమా॥ ౧౧౩॥

తా॥ రత్నములతోఁగూర్చఁబడిన బంగారపు మంచము ఆమం టపములో నుంచి మంచి విలువగల వస్త్రములతో నామంచముపైని మనోహరమగు శయ్యను కూడ నేర్పరచవలయును.

మూ॥ తస్యాం షోడశమాషైస్తు ప్రతిమా కాంచనోద్భవా । ద్విభుజారామచంద్రస్య సర్వలక్షణలక్షితా॥ ౧౧౪॥ చతుర్వింశతి మాషైశ్చ ప్రతిమారజతోద్భవా । కౌసల్యాయాః శుభాకార్యా పూజనీయామనోరమా॥ ౧౧౫॥

తా॥ రెండు చేతులు నుండునట్లుగాను సమస్త శుభలక్షణము లతోఁ గూడినట్టి శ్రీరామచంద్రమూర్తి యొక్క ప్రతిమను పదియా నవరసు బంగారముతోను జేయించి ముప్పది చిన్నములు యెత్తుగల వెండితో కౌసల్యాదేవియొక్క ప్రతిమయు సుందరముగానుండునట్లు జేయించి యామంటపములోనుంచి పూజింపవలయును.

మూ॥ యథావిత్తానుసారేణ పూజయేత్ప్రత్యహం నరః । భేరీ మృదంగతూర్యైశ్చ గీతనృత్యాదికారయేత్॥ ౧౧౬॥ నానాపక్వాన్న నైవేద్యై రుపచారైస్సుపూజయేత్॥

తా॥ తేక తన శక్తికొలదియు శ్రీరామచంద్రమూర్తి యొక్క యుఁ గౌసల్యాదేవియొక్కయుఁబ్రతిమలను జేయించి తొమ్మిదిదినము లును నిత్యము బూజింపుచు నృత్యగీతాదికములను జరుపుచు భేరీ మృదంగాది వాయిద్య విశేషములచే ధ్వనులను జేయించుచు, ననేక విధములగు పక్వాన్నములను నివేదనజేయుచు నిట్లు షోడశోపచార పూజలచేఁ బూజింపవలయును.

మూ॥ ప్రతిపద్దినమారభ్య యావత్తు నవమీ దినం । రామా యణంతావదేవ పఠనీయ మిదంశుభమ్॥ ౧౨౦॥

తా॥ పాడ్యమి మొదలు శ్రీరామనవమి పర్యంతము శుభప్రదమగు శ్రీమద్రామాయణమును జదివింపఁజేయవలయును.

మూ॥ యద్వై వాల్మీకినాగీతం శ్రవణాన్మంగళప్రదం। ఆనందసంజ్ఞకంరమ్యం పఠనీయం మనోరమమ్॥ ౧౨౧॥

తా॥ లేక వాల్మీకి మహామునిచేతనే జెప్పఁబడినదియు వినుటవల్లనే సమస్తశుభముల కలిగింపఁజేయునదియు మనోహరమగు ఆనందరామాయణమునుగాని చదివింపఁజేయవలయును.

మూ॥ నవకాండానినవభి ర్దినైరేవ పఠేన్నరః। దినేదినే కాండం పఠనీయంప్రయత్నతః॥ ౧౨౨॥

తా॥ ఆయానందరామాయణము తొమ్మిది కాండలుకలది కాఁబట్టినిత్యమునొక్కొక్కకాండముచొప్పున తొమ్మిదిదినములలోను తొమ్మిదికాండలను మిక్కిలిప్రయత్నముతోఁబూర్తిఁజేయవలయును.

మూ॥ అథవాప్రత్యహంసర్గాః పఠనీయాస్తుద్వాదశః। శేషస్త్వేకః కదామధ్యే ధికస్సోపిపఠేన్నరః॥ ౧౨౩॥

తా॥ లేక నిత్యము పండ్రెండు సర్గలు చొప్పున తొమ్మిది దినములును పఠనజేయగా నొక్క సర్గమిగులును. దానిని యీ తొమ్మిది దినములలో నెప్పుడైనను పఠనజేయవలయును.

మూ॥ అష్టోత్తరశతైస్సర్గైః రామకీర్తనమాలికా। మేరుయుక్తా పఠేదేవం రామాగ్రేనవభిర్దినైః॥ ౧౨౪॥

తా॥ నూటయెనిమిది సర్గలును మేరువుతోఁగూడిన రామమాలయు తొమ్మిది దినములలోను శ్రీరామసన్నిధానమందు పఠించవలయును.

మూ॥ సర్వతీర్థేషు యత్పుణ్యం సర్వదానేషు యత్ఫలం। రామాయణస్య పఠనా త్తత్ఫలంనవరాత్రకే॥ ౧౨౫॥

తా॥ సమస్త తీర్థములను సేవించినందువల్ల యేమి ఫలము కలుగునో సమస్తదానములను జేసినందువల్ల నేమి ఫలము కలుగునో వసంతనవరాత్రములలో రామాయణమును జదువుటవల్ల నట్టిఫలము కలుగును.

మూ॥ శ్లోకంవా శ్లోకపాదంవా యదా రామాయణ సంభవం।
నవరాత్రే పఠిష్యంతి చైత్రే తే మోక్షభాగినః॥ ౧౨౬॥

తా॥ చైత్రమాసములో వసంత నవరాత్రులయందు రామాయణములో నొక్క శ్లోకమునుగాని యొక్క పాదమునుగాని పఠించిన వారు మోక్షము నొందుదురు.

మూ॥ ఏవం హి ప్రత్యహం కార్యం కౌసల్యారామ పూజనం।
సుపుత్రిణాంతు నారీణాం తత్ర కార్యం ప్రపూజనమ్॥ ౧౨౭॥

తా॥ ఇట్లు నిత్యము కౌసల్యాదేవి యొక్కయు శ్రీరాములయొక్కయు పూజనుఁ జేయవలయును. మఱియు సంతానయుక్తులగు సువాసినీ స్త్రీలనుకూడముఖ్యముగా వసంతనవరాత్రములలో పూజింపవలయును.

మూ॥ సుపుత్ర ద్విజవర్యాణాం విశేషాత్పూజనం స్మృతం।
వస్త్రాద్యలంకారయుతం చిత్ర భోజన భోజితమ్॥ ౧౨౮॥

తా॥ ఇట్లు సంతానయుక్తులగు సువాసినీ స్త్రీలనుసంతానవంతులగు బ్రాహ్మణోత్తములను తొమ్మిదిదినములు నిత్యముచిత్రవిచిత్రములగు పక్వాన్నములచేభుజింపఁజేసివస్త్రాభరణాదుల నిచ్చిపూజింపవలయును.

మూ॥ ఏవం కృత్వా విధిం సర్వం నవమ్యాంచ విశేషతః।
పూజయిత్వా రామచంద్రం వాహనారూఢ ముత్తమమ్॥ ౧౨౯॥
భేరీమృదంగ ఘోషైశ్చ తూర్యదుందుభినిస్వనైః। వార స్త్రీ నృత్య కృత్యైశ్చ గాయకానాంచ గాయనైః॥ ౧౩౦॥

తా॥ ఇట్లు నిత్యము పూజింపుచు నవమియందు విశేషముగా పూజించి అనఁగా సింహాసనారూఢుఁడగు శ్రీరామచంద్రమూర్తి ప్రతిమను పూజించి భేరీ మృదంగము దుందుభి మొదలగు వాద్యములను మ్రోగింపఁజేయుచు వేశ్యా స్త్రీలచే నృత్యగీతాదులను జరిపించుచు సంగీతపాఠకులచే సంగీతమును పాడింపవలెను.

మూ॥ ఏవం నానాసముత్సాహై ర్మండితం ఛత్ర శోభితం।
చామరై ర్వీజ్యమానంచ పుష్పకే సంస్థితంవరమ్॥ ౧౩౧॥ రామతీర్థాంతికంనీత్వా పంచామృత ఘటైర్వరైః। స్నాపయేద్రఘువీరంహి పుణ్యతోయైస్తతః పరమ్॥ ౧౩౨॥

తా॥ ఇట్లు అనేక విధములగు వైభవములచే దీపింపఁజేసి శ్వేత ఛత్రము వింజామరలు మొదలగువానిని ధరింపఁజేసి పుష్పకవిమాన మునందుంచి రామతీర్థమునకు తీసికొనివెళ్లి పంచామృతములచే ముందుగా స్నానముఁజేయించి యటుపిమ్మట గంగాదిపుణ్యజలములచే స్నానముఁ జేయించవలయును.

మూ॥ రుద్రసూక్తైర్విష్ణుసూక్తైస్సహస్రైర్నామభిస్తుతా।
మాంగల్యద్రవ్యసంమిశ్రైర్జలైస్సమభిషేచయేత్॥ ౧౩౩॥

తా॥ రుద్రసూక్తములు విష్ణుసూక్తములు సహస్రనామములను పఠింపుచు కస్తూరి అగరు మొదలగు శోభస్కర ద్రవ్యములతో గలిపిన జలములచే నాశ్రీరామమూర్తికి నభిషేకముఁ జేయవలెను.

మూ॥ మాంగల్య వరద్రవ్యైశ్చ నానా తన్మంగళాభిదం।
ప్రోచ్యతే తన్మంగళస్నానం తచ్చైత్రే దుర్లభంనృణామ్॥ ౧౩౪॥

తా॥ శుభప్రదములగు ననేక మంగళ ద్రవ్యములచే గలిపిన జలములచే స్నానముఁజేయుట మంగళస్నానమని చెప్పఁబడును. అట్టి మంగళస్నానము చైత్రమాసములో జేయుట మిక్కిలి ముఖ్యమైనది.

మూ॥ తత్పంచామృత తీర్థంతు తీర్థమధ్యే వినిక్షిపేత్
తతస్సర్వే జనైశ్శీఘ్రం స్నాతవ్యం తదనంతరమ్॥ ౧౩౫॥

తా॥ మిగిలిన పంచామృతములను శ్రీరామతీర్థ జలములలో గలిపి యనంతరము ఆజనులందఱును ఆజలములలో స్నానముఁజేయ వలయును.

మూ॥ సహస్రావభృదైస్స్నానై ర్యత్ఫలం ప్రాప్యతేనరైః
తత్ఫలం రామచంద్రస్య మంగళస్నాన కారణాత్॥ ౧౩౬॥

తా॥ వెయ్యి పర్యాయములు అవభృదస్నానముఁ జేయుటవల్ల కలిగిన ఫలమును శ్రీరామచంద్రునకు మంగళస్నానముఁ జేయుట వల్ల పొందువాఁడగును.

మూ॥ పుష్కరాదిషు తీర్థేషు గంగాద్యాసుసరిత్సుచ। ప్రాప్యతే యత్ఫలం స్నానా న్మంగళస్నాన కృచ్ఛతత్॥ ౧౩౭॥

తా॥ పుష్కరము మొదలగు తీర్థములయందును గంగ మొదలగు నదులయందును స్నానముఁ జేయుటవలన గలిగినట్టి పుణ్యము చైత్రమాసములో మంగళస్నానముఁ జేయుటవలన గలుగును.

మూ॥ ఏవం రామంతు సంస్నాప్య సీతాయుక్తం ప్రపూజ్యచ।
పునఃపూర్వోక్త వాద్యాది మంగళై రానయేద్గృహమ్॥ ౧౩౮॥

తా॥ ఇట్లు సీతారాములను స్నానముఁ జేయించి పిమ్మట పూజచేసి పూర్వము చెప్పఁబడిన భేరీ మృదంగాది మంగళవాద్యధ్వనులతో తిరిగి యింటికి తీసికొనిరావలయును.

మూ॥ గృహేరామం పునఃపూజ్య రామాయణకృతం వరం।
పారాయణం సమాప్యాథ పుస్తకం పూజయేచ్ఛుభమ్॥ ౧౩౯॥

తా॥ ఇంటికిఁ దీసికొని వచ్చిన పిమ్మట సీతారామప్రతిమలను తిరిగి పూజించి రామాయణ పారాయణమును పూర్తిఁజేసి శుభప్రదమగు ఆపుస్తకమును షోడశోపచారములచే పూజింపవలయును.

మూ॥ నానోత్సవైర్దినం నీత్వా కార్యం జాగరణంనిశి। దశమ్యాం ప్రాతరుత్థాయ భోజయిత్వా ద్విజాన్బహూన్॥ ౧౪౦॥ పూజయిత్వా పునస్సర్వం గురవేత ద్విసర్జయేత్। తతస్స్వయం సుహృన్మిత్రైః కుర్యా ద్భోజనముత్తమమ్॥ ౧౪౧॥

తా॥ ఆదినమంతయు అనేక యుత్సవములచే వెళ్ళబుచ్చి రాత్రి తెల్లవారు నంతవఱకు జాగరణజేసి దశమిరోజున యుదయమున లేచి స్నాన సంధ్యావందనాది క్రియలనుఁజేసికొని తిరిగి శ్రీరామప్రతిమను పూజించి యనేక బ్రాహ్మణులకు సమారాధనజేసి తాను మిత్రబాంధవులతో భుజించి శ్రీరామప్రతిమ సహితముగా ఆమంటపమును ఆచార్యునకు సమర్పించవలయును.

మూ॥ ఏవం వ్రతం సమాఖ్యాతం చైత్రస్య నవరాత్రకే।
అత స్తం నవరాత్రంహి శ్రేష్ఠం చైత్రే మహత్తమమ్॥ ౧౪౨॥

తా॥ ఇట్లు చైత్రమాసములో వసంత నవరాత్రులయందు వ్రతము చెప్పఁబడినది. కాఁబట్టి శ్రేష్ఠంబగు యీనవరాత్రవ్రతముఁ జేయుట మిక్కిలి మంచిది.

మూ॥ నవరాత్రేపి సారామ నవమీ పరమార్థదా । తత్స మానా తిథిర్నాన్యా చైత్రమాసే శుభప్రదా॥ ౧౪౩॥

తా॥ వసంత నవరాత్రములలోను శ్రీరామనవమి మిక్కిలి పరమార్థము నొసగునదియగును. కాఁబట్టి చైత్రమాసములో నవమితో సమానమగు శుభప్రదమైనది మఱియొక తిథిలేదు.

మూ॥ అతఃపరం ప్రవక్ష్యామి చైత్రోద్యాపనకం తిథిం । యత్కృత్వా సఫలం సర్వం చైత్రస్నానంతు జాయతే॥ ౧౪౪॥

తా॥ ఇఁకముందు చైత్రమాస వ్రతోద్యాపన విధానమును జెప్పెదను వినుము. అట్టి యుద్యాపమును జేసినయెడల చైత్రమాస స్నాన వ్రతమంతయు సఫలమగును.

మూ॥ చైత్రమాసే సితేపక్షే యావైహ్యేకాదశీతిథిః।సర్వాసు తిథిషు శ్రేష్ఠా చోపోష్యావిధికారిభిః॥ ౧౪౫॥

తా॥ చైత్రమాసములో శుద్ధయేకాదశి సమస్త తిథులలోను శ్రేష్ఠమైనది కాఁబట్టి యాదినమందు విధిప్రకారముగా నుపవాసము జేయవలయును.

మూ॥ శ్రేష్ఠాసాద్వాదశీ జ్ఞేయా తస్యాంతు యమపూజనం । కార్యందధ్యో దనందత్వా జలకుంభః ప్రదీయతామ్॥ ౧౪౬॥

తా॥ తర్వాత ద్వాదశీ తిథియు శ్రేష్ఠమైనది. కాఁబట్టి ఆదిన మందు యముని పూజించి దధ్యోదనమును నివేదనఁజేసి జలకుంభ దానముఁ జేయవలయును.

మూ॥ తిస్రశ్చ తిథయ శ్రేష్ఠా శ్చైత్రే మాసిమహత్తమాః । త్రయోదశీ తథాభూతా పౌర్ణమాసీ తథైవచ॥ ౧౪౭॥ యాసు స్నానంచ దానంచ సర్వవాంఛిత దాయకమ్॥ ౧౪౮॥

తా॥ త్రయోదశి చతుర్దశి పౌర్ణమి యీమూఁడు తిథులును చైత్రమాసములో నుత్తమమైనవి. ఆతిథులయందు స్నానముఁజేసినను దానమిచ్చినను సమస్తకోరికల నొసఁగునదియగును.

మూ॥ యైర్నస్నానం చైత్రమాసే నస్నానం నవరాత్రకే । తైస్తైశ్చాంత్య దినేస్నాత్వా చైత్రస్నాన ఫలంలభేత్॥ ౧౪౯॥

తా॥ చైత్రమాసములో పాడ్యమి మొదలు నెల దినములెలుక స్నానముఁ జేయనివారును లేక పాడ్యమి మొదలు నవమి పర్యంతము స్నానముఁజేయనివారును పైనచెప్పఁబడిన త్రయోదశి మొదలు మూడుదినములలో నొక్క దినమందైనను స్నానముఁజేసిన యెడల చైత్రి మాస స్నానముఁజేసిన ఫలము నొందువారగుదురు.

మూ॥ తాసుశ్రేష్ఠాపూర్ణిమాహి సర్వపాతక నాశనీ । తస్యాముద్యాపనం ప్రోక్తం చైత్రస్నాన ఫలాప్తయే॥ ౧౯౦॥

తా॥ ఆమూడు తిథులలో పౌర్ణమి మిక్కిలి శ్రేష్ఠమైనదియు సమస్త పాపములను పోగొట్టునదిగాను జెప్పఁబడెను. కాఁబట్టి ఆపౌర్ణమియందు నుద్యాపన చేసినయెడల చైత్రమాసములో నెల దినముల ఫలము నొందునట్టిదియగును.

మూ॥ ఉపోష్యచ చతుర్దశ్యాం పూర్వవన్మంటపాదికం । కృత్వాతస్మిన్‌ధాన్యరాశౌ కలశంవారిపూరితమ్॥ ౧౯౧॥ స్థాపయిత్వా తదుపరి హేమపాత్రం సువిస్తృతం । పంచరత్న యుతంస్థాప్య వస్త్రేణాచ్ఛాదయేత్తతః॥ ౧౯౨॥

తా॥ ఉద్యాపనవిధి యెట్లనఁగా చతుర్దశియందు నుపవాసముండి పూర్వమువలెనే మంటపము మొదలగునవి నిర్మించి యామంటపములో ధాన్యరాశిబోసి జలముతో నిండింపఁబడిన కలశమును ధాన్యరాశియందుంచి దానిపైని బంగారపు పాత్రను పంచరత్నముల నుంచి దానికి వస్త్రమును జుట్టవలయును.

మూ॥ తస్మిన్ సీతా యుతం రామం సౌవర్ణం విధిపూర్వకం । భ్రాతృభిర్వాయు పుత్రేణ సుగ్రీవేణ సమన్వితమ్॥ ౧౯౩॥ విభీషణాంగదాభ్యాంతు జాంబవత్సహితంతథా । పూజయేద్దేవ దేవేశం పరమం గుర్వనుజ్ఞయా॥ ౧౯౪॥

తా॥ బంగారుతోఁ జేయబడిన సీతారాముల ప్రతిమను ఆకలశముపైనుంచి యథావిధిగా పూజింపవలయును. మఱియు సోదరులగు భరత లక్ష్మణ శత్రుఘ్న విగ్రహములను ఆంజనేయ సుగ్రీవ అంగద జాంబవంతుల విగ్రహములుకూడ నుంచవలయును. ఇట్లు సమస్త

...ంవార సమేతముగా నుండునట్టి యాసీతారామ ప్రతిమను ఆచార్యులు చెప్పిన ప్రకారము యథావిధిగా పూజింపవలయును.

మూ॥ ఉపచారైష్షోడశభి ర్నానాభక్ష్య సమన్వితైః । రాత్రౌ జాగరణంకుర్యా ద్గీతవాద్యాది మంగళైః॥ ౧౫॥

తా॥ షోడశోపచారములచేబూజించి యనేకవిధములగుభక్ష్యాదులతోఁగూడినపక్వాన్నముల నివేదనఁజేసిగీతమువాద్యమునృత్యము పురాణపఠనము మొదలగువానిచే రాత్రి జాగరము చేయవలయును.

మూ॥ తతస్తు పౌర్ణమాస్యాంచ సపత్నీకాన్ద్విజోత్తమాన్ । త్రింశన్మితానథైకంవా స్వశక్త్యావానిమంత్రయేత్॥ ౧౬॥

తా॥ అనంతరము పౌర్ణమియందు భార్యలు గలిగియుండెడి బ్రాహ్మణోత్తములను ముప్పదిమందినిగాని తన శక్తికొలది పది మందినిగాని లేక యొక్కరినిగాని నియమించవలయును.

మూ॥ తతస్తాన్ భోజయేద్విప్రాన్ పాయసాన్నాదినావ్రతీ । అతోదేవా ఇతిద్వాభ్యాం జుహుయాత్తిలసర్పిషా॥ ౧౭॥ ప్రీత్యర్థం దేవదేవస్య దేవానాంచ పృథక్పృథక్॥

తా॥ అతోదేవా, అను రెండుమంత్రములచే నువ్వులు నెయ్యి మొదలగువానితో దేవదేవుండగు శ్రీరాములకు దేవతులకు తృప్తి కొఱకు వేరువేరుగా హోమముఁ జేయవలయును. పిమ్మట ఆ నియమింపఁబడిన బ్రాహ్మణులకు క్షీరాన్నము మొదలగువానితో భోజనము పెట్టవలయును.

మూ॥ దక్షిణాంచ యథాశక్త్యా ప్రదద్యాచ్చ తతోనమేత్॥ ౧౮॥ పునర్దేవం సమభ్యర్చ్య దేవాంశ్చ తులసీంతథా । తతో గాం కపిలాం తత్రపూజయేద్విధినావ్రతీ॥ ౧౯॥

తా॥ తన శక్తికొలది దక్షిణలనిచ్చి నమస్కారముఁ జేయవలయును పిమ్మట శ్రీరామచంద్రుని దేవతులను కపిలగోవును తులసిని యథావిధిగా పూజింపవలెను.

మూ॥ గురుం ప్రతోపదేష్టారం వస్త్రాలంకార మండనైః । సపత్నీకం సమభ్యర్చ్య తతోవిసర్జ్య క్షమాపయేత్॥ ౨౦॥

తా॥ వ్రతమును జేయించినట్టి యాచార్యుని భార్యాసహితముగా వస్త్రములు ఆభరణములు మొదలగువానితోఁ బూజించి పిమ్మట బ్రాహ్మణులను క్షమాపణగోరవలెను.

మూ॥ యుష్మత్ప్రసాదాద్దేవేశ స్సుప్రసన్నోఽస్తువై మమ। వ్రతాదస్మాచ్చయత్పాపం సప్తజన్మకృతంమయా॥ ౧౬౧॥ తత్సర్వం నాశ మాయాంతు స్థిరామేచాస్తుసంతతిః। మనోరథాస్తు సఫలా స్సంతు నిత్యం మమార్చనాత్॥ ౧౬౨॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తములారా! మీ యనుగ్రహమువలన దేవతాప్రభువగు శ్రీరామమూర్తి నాయందు ననుగ్రహముకలవాఁడై యుండుగాక. నేను యేడు జన్మములయందు జేయఁబడినట్టియు పాపము ఈవ్రతమువలన సమస్తము నశించుగాక. నాసంతానము దీర్ఘాయుష్మంతులై స్థిరముగా నుండుగాక. నేను పూజించుటచే నా కోరికలన్నియు సఫలములగుగాక.

మూ॥ దేహాంతే వైష్ణవంస్థానం మమచాస్త్వతి దుర్లభమ్। ఇతి క్షమాప్యతాన్విప్రాన్ ప్రసాద్యచ విసర్జయేత్॥ ౧౬౩॥

తా॥ నేను మృతినొందిన పిమ్మట నెవరికిని సంభవింపని వైకుంఠలోకము నాకు వచ్చుగాక. ఈప్రకారము ఆబ్రాహ్మణులకు క్షమాపణఁజెప్పి వారలను ప్రార్థించి వారలను పంపవలయును.

మూ॥ తామర్చాం గురవేదద్యా ద్రత్నయుక్తాం సదావ్రతీ। తతస్సుహృత్ప్రియైర్బంధు స్స్వయంభుంజీత భక్తిమాన్॥ ౧౬౪॥

తా॥ రత్నములతోఁగూడిన యాపూజామంటపమును గురువునకు నిచ్చి పిమ్మట తాను బంధువులు స్నేహితులు ఇష్టులు మొదలగువారందరును భక్తితోఁగూడినవారై భుజింపవలయును.

మూ॥ ఏవ ముద్యాపనవిధి శ్చైత్రస్నాన ఫలాప్తయే। సవిస్తరశ్చ కర్తవ్య శ్చైత్రస్నాన పరాయణైః॥ ౧౬౫॥

తా॥ ఈప్రకారము చైత్రమాసస్నానముఁజేయుటయందాశక్తి కలవారు చైత్రమాస స్నానఫలమును పొందు నిమిత్తము ఉద్యాపనమును సవిస్తారముగాఁ జేయవలయును.

మూ॥ ఏవం యఃకురుతేసమ్య క్చైత్రస్నాన వ్రతం నరః।
సర్వపాప వినిర్ముక్తో విష్ణుసాయుజ్య మాప్నుయాత్॥ ౧౬౬॥

తా॥ ఇట్లు చైత్రమాస స్నాన వ్రతమునుఁ జేసిన మనుష్యుఁడు సమస్త పాపములవల్లను విడువఁబడి విష్ణుమూర్తియందు నైక్యముఁ జెందువాఁడగును.

మూ॥ సర్వవ్రతై స్సర్వతీర్థై స్సర్వదానైశ్చ యత్ఫలం।
తత్కోటి గుణితం పుణ్యం సమ్యగస్య విధానతః॥ ౧౬౭॥

తా॥ సమస్త వ్రతములను సమస్త దానములనుఁ జేసినందు వల్లను సమస్త తీర్థయాత్రలను సేవించినందువల్ల నేమి ఫలము కలుగునో ఈవ్రతమును యథావిధిగాఁ జేసినందువల్ల ఆపుణ్యమునకు కోటిరెట్లు కలుగును.

మూ॥ దేహస్థితాని పాపాని నాశమాయాంతి తద్భయాత్ ।
క్వయాస్యామో వదంత్యేవం యచ్చైత్రవ్రతకృన్నరః॥ ౧౬౮॥
తస్మాదవశ్యమేవైత చ్చైత్రస్నానం సమాచరేత్॥

తా॥ దేహమునందుండెడి సమస్త పాపములును ఆ శ్రీరామ చంద్రుని యొక్క భయమువలన ఎక్కడికిని వెళ్లలేము అని తమలో జెప్పుకొనుచు నశించును కాఁబట్టి యీచైత్రస్నాన వ్రతమును ముఖ్య ముగాఁ జేయవలెను.

మూ॥ శ్రీచైత్ర వ్రత కథనం పఠంతిభక్త్యాయేవైతద్విజయంతి వైష్ణవాః వదంతి॥ ౧౬౯॥ తేసమ్యగ్వ్రతకరణాత్ఫలం లభంతే తత్స ర్వం కలుషవినాశనం ఫలం లభంతే॥ ౧౭౦॥

తా॥ ఎవరు ఈవ్రతకథను భక్తితో జదువుచున్నారో వారు విజయమును పొందుదురు.. విష్ణు భక్తులనియు చెప్పఁబడుదురు. చక్కగా వ్రతమును జేయుటవలన సమస్త పాపములు నశించును మోక్షఫలము కలుగును.

ఇతి శ్రీశతకోటి రామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే
వాల్మీకియే మనోహరకాండే చైత్రస్నాన విధివర్ణనం
నామదశమస్సర్గః॥ సమాప్తః॥

# ఏకాదశసర్గప్రారంభః.

విష్ణుదాసఉవాచ॥ శ్లో॥ కిమర్థం సర్వమాసేషు చైత్రమాస స్మృతోవరః । తత్కారణం వదస్వాద్య గురో సంతోషహేతవే॥ ౧॥

తా॥ విష్ణుదాసుఁడు అడుగుచున్నాఁడు. ఓ గురువా! సమస్త మాసములలోను చైత్రమాసమెందుకు శ్రేష్ఠమైనది. ఆకారణమునుఁ జెప్పిన యెడల నాకు సంతోషముగా నుండును.

శ్రీరామదాసఉవాచ॥ శ్లో॥ శృణుశిష్య మహాబుద్ధే సమ్యక్పృష్టం త్వయామమ । బ్రహ్మప్రార్థనయావిష్ణు ర్యదాభూమ్యాం ద్విజోత్తమ॥ ౨॥ అయోధ్యాపాలకస్యాథ రాజ్ఞోదశరథస్యహి । కౌసల్యాయాస్తు భార్యాయా జఠరాన్నిర్గతో బహిః॥ ౩॥ చైత్రమాసే సితే పక్షే నవమ్యాం పరమేదినే । పునర్వసు సునక్షత్రే స్వోచ్చస్థే గ్రహపంచకే॥ ౪॥ మధ్యాహ్నే ప్రకటోజాతః శ్రీరామో రాజసద్మని॥ ౫॥

తా॥ శ్రీరామదాసుఁడను గురువుఁ జెప్పుచున్నాఁడు. విశేష సూక్ష్మబుద్ధిగల యోశిష్యుఁడా! ఆకారణమునుఁ జెప్పెదనువినుము. నీవు జేసినప్రశ్న బాగుగానున్నది. ఏమనఁగా భూలోకమునందు గాని, స్వర్గలోకమునందుగాని రావణాది రాక్షసులబాధ విశేషముగా సంభవించగా బ్రహ్మదేవుఁడు విష్ణుమూర్తిని ప్రార్థించెను. అప్పుడు అయోధ్యాపట్టణమును పరిపాలింపు చుండెడి దశరథ మహారాజు యొక్క భార్య యగు కౌసల్యాదేవియొక్క గర్భమువల్లను జని యించెను. చైత్రమాసములో శుక్లపక్ష నవమి యగు శ్రేష్ఠంబైన తిథియందును పునర్వసు యను మంచినక్షత్రమందును కర్కాటకలగ్న మందును అయిదు గ్రహములుచ్చస్థానమందుండఁగా మధ్యాహ్నకాల మందు శ్రీరామచంద్రుఁడను నామముతో దశరథమహారాజుయొక్క గృహమునందు జనియించెను.

శ్లో॥ ఆనందశ్చ సదాజాత స్సర్వత్ర జగతీతలే । దేవదుందుభయోనేదుః పుష్పవృష్టి శ్చభాపతత్॥ రాజసద్మని వాద్యానాం సంఘానేదుః పృథక్ పృథక్॥ ౬॥

తా॥ అప్పుడు శ్రీరామచంద్రమూర్తి జనియించిన సమయము నందు మనుష్యులు మొదలగు సమస్త జీవరాసులకు నానందము కలిగినది. దేవతాదుందుభులు మ్రోగినవి. స్వర్గలోకమునుండి మంగళప్రదమగు పుష్పవర్షము గురిసినది. దశరథమహారాజుగారి గృహమునందు ఢంకభేరీ నవభత్ మొదలగు సమస్త వాద్యములను మ్రోగించిరి.

శ్లో॥ ననృతుర్వారనార్యశ్చ జగుర్గీతం మనోరమం। తదా సర్వేపి భూమిస్థా జనాద్రష్టుం శుభంశిశుం॥ ౭॥ ప్రయయునర్నృపజం బాలం దృష్ట్వాముదమవాపున్నయుః॥

తా॥ వేశ్యాస్త్రీలు నాట్యమాడిరి. సంగీతపాఠకులు వీణ మొదలగు వాద్యములతో నానందముగా పాడిరి. సర్వలక్షణ సంపన్నుం డను మహానుభావుడును దశరథమహారాజు పుత్రుడునగు యా బాలుని చూచు నిమిత్తము సమస్త దేశజనులును వచ్చి చూచి యానందించిరి.

శ్లో॥ నానా విమాన మారూఢా దివిదేవా స్సవా సవాః॥ ౮॥ మిళితారాఘవం ద్రష్టుం కౌసల్యా జఠరోద్భవం। బ్రహ్మారుద్రశ్చ సూర్యశ్చ దేవేంద్రాది సురాస్శుభాః॥ ౯॥

తా॥ బ్రహ్మ సూర్యుడు దేవేంద్రుడు మొదలగు సమస్త దేవతలును స్వర్గలోకమునందు ననేక విమానముల నెక్కి అందఱు కలసి కౌసల్యా గర్భసంభవుడగు శ్రీరామచంద్రమూర్తిని జూచు టకు వచ్చిరి.

శ్లో॥ ఉత్సవాన్ విదధుస్సర్వే తదా శ్రీరామ జన్మని। ఏవ ముత్సాహసమయే హర్షాద్దేవాది విస్థితాః॥ ౧౦॥

తా॥ శ్రీరామచంద్రుడు పుట్టిన సమయమందు జనులందఱు సంతోషముచే నుత్సవములను జరిపిరి. దేవతలును ఆకాశమునం దుండి జూచుచుండిరి.

శ్లో॥ నమస్కృత్వా రామచంద్రం తుష్టువు ర్వివిధై స్తవైః। ప్రోచు స్తదా సురాస్సర్వే హర్షాద్దేవం రఘూత్తమమ్॥ ౧౧॥

తా॥ శ్రీరామచంద్రమూర్తికి సమస్త దేవతలును నమస్కారముఁజేసి యనేక విధములుగా స్తుతియించి సంతోషముతో నీదిగువ చెప్పఁబోవు ప్రకారము ప్రార్థించిరి.

శ్లో॥ అద్య ధన్యావయం దేవ ముక్తాశ్చాసురజాద్భయాత్ । యన్నిమిత్తం త్వయా దేవ హ్యావతారః కృతోభువి॥ ౧౨॥

తా॥ ఓ మహానుభావా! నీవు భూలోకభారము పోగొట్టుటకొఱకు భూలోకములో నవతరించితివి కాఁబట్టి రాక్షసులవల్ల కలిగెడు బాధనివృత్తియైనది. మాకు భయములేదు కాఁబట్టి ధన్యులమైతిమి.

శ్లో॥ అస్మాకం హర్షణకాలోయం దేవదేవ కృపానిధే । తస్మాదయం సదాపుణ్యః శ్రేష్ఠఃకాలో భవిష్యతి॥ ౧౩॥

తా॥ దేవతులకు ప్రభువును దయాసముద్రుఁడవగు నోదేవా! నీవు జనియించుటచే ఈకాలము మిక్కిలి శ్రేష్ఠమైనదియుఁబుణ్యప్రదమైనది మాకు సంతోషకరమైనదియుగా విలసిల్లుచున్నది.

శ్లో॥ త్వంచాప్యంగీ కురుష్వాద్య దేహ్యస్మైసు బహూన్ వరాన్ । ఇతి తేషాంవచఃశ్రుత్వా దేవానాం రాఘవశ్శుభమ్॥ ౧౪॥ తుతోష నితరాం తేషు దేవేషు భగవాన్ హరిః॥

తా॥ ఓ స్వామీ మేముఁజేసిన ప్రార్థనలనంగీకరించి మాకు విశేషవరముల నొసగుమని యాదేవతలు ప్రార్థించగా శ్రీరామచంద్రుఁడు వారివాక్యములను విని సంతోషించి వారియందు నన్ముగ్రహముకలవాఁడై యిట్లు పలికెను.

శ్రీరామఉవాచ॥ శ్లో॥ సమక్ప్రోక్తం సురాస్సర్వే యత్త్రైలోక్యోపకారకం । భవద్భిః ప్రార్థితోహంతు హర్షణకాలే మహత్తమే॥ ౧౫॥

తా॥ ఓ దేవతులారా! మీరుఁజేసిన స్తోత్రము బాగుగానున్నది. మూఁడు లోకములకు నుపకారమైనది. ఇట్టి మహాసంతోషసమయమందు మీరుచేసిన స్తోత్రముచే మిక్కిలి సంతోషించితిని.

శ్లో॥ శృణుధ్వం వచనంమేద్య యాద్ధర్షాతోప్రోచ్య తేమయా। సర్వేషామేవమాసానాం శ్రేష్ఠశ్చాయం భవిష్యతి॥ ౧౬॥

తా॥ ఓ దేవతులారా! నాకు సంతోషకరముగానున్నది. నేను జెప్పెడి వాక్యమును వినుఁడు. ఈ చైత్రమాసములో నేను జనియించుటచే నన్ని మాసములలోను ఈ చైత్రము శ్రేష్ఠమైనదిగాఁ జెప్పఁబడును.

శ్లో॥ వైశాఖా త్కార్తిక శ్రేష్ఠః కార్తికా న్మాఘ ఏవచ। మాఘమాసా ద్వరశ్చాయం చైత్రమాసో భవిష్యతి॥ ౧౭॥

తా॥ వైశాఖమాసముకంటె కార్తికమాసము, కార్తికమాసముకంటె మాఘమాసము, మాఘమాసముకంటె యీచైత్రమాసము శ్రేష్ఠమైనదిగాఁ జెప్పఁబడును.

శ్లో॥ చైత్రమాసే హుతందత్తం కృతం స్నాతం విచింతితం। సర్వం కోటిగుణంప్రోక్త మయోధ్యాయాం విశేషతః॥ ౧౮॥

తా॥ చైత్రమాసములో జేయఁబడిన హోమము దానము సద్ధర్మము స్నానము మొదలగునవి యన్నియు కోటిరెట్లు ఫలము కలవియగును. అయోధ్యలో జేసిన యెడల మిక్కిలి విశేషఫలము నిచ్చును.

శ్లో॥ యచ్ఛ్రేయశ్చాశ్వమేధేన యద్గోమేధేనవైఫలం। యత్ఫలం సోమయాగేన తచ్చైత్రేస్నానమాత్రతః॥ ౧౯॥

తా॥ అశ్వమేధము గోమేధము సోమయాగము చేసినందువల్ల యేమిఫలము కలుగునో చైత్రమాసములో ప్రాతఃకాలమందు స్నానముఁజేయుటవలన ఆఫలముకలుగును.

శ్లో॥ సూర్యగ్రహే కురుక్షేత్రే యచ్ఛ్రేయః స్నాన దానతః। తచ్ఛ్రేయస్స్యా న్మధౌస్నానా దయోధ్యాయాం సురోత్తమాః॥ ౨౦॥

తా॥ ఓ దేవతులారా! సూర్యగ్రహణము సంభవించినప్పుడు కురుక్షేత్రములో స్నానము దానము మొదలగునవి జేయుటవలన గలిగిన ఫలము చైత్రమాసములో నయోధ్యాపట్టణమందు సరయూనదిలో స్నానముఁజేయుటవలన నట్టిఫలము తప్పకకలుగును.

శ్లో॥ అత్రవైసరయూతీరే రావణం లోక రావణం। హత్వా తత్పాపశాంత్యర్థం కరిష్యామి క్రతుంశుభమ్॥ ౨౧॥

తా॥ త్రిలోకములను బాధించుచుండెడని రావణాసురుని సంహరించి యాపాపమును పోగొట్టుకొనుటకు ఈ అయోధ్యాపట్టణములో సరయూనదీతీరమందు శ్రేయస్కరమగు నశ్వమేధ యాగమునుఁ జేయువాఁడనగుదును.

శ్లో॥ యత్రయాగ సమాప్తిర్మే భవిష్యతి సురోత్తమాః ।
తత్తీర్థం మమనామ్నాహి ఖ్యాతిం శ్రేష్ఠాంగమిష్యతి॥ ౨౨॥

తా॥ ఓ దేవతలార! నేను యెక్కడ సరయూతీరమందు యజ్ఞమునుఁ జేసి సంపూర్తిఁ జేయుదునో సరయూతీరమందు అది రామతీర్థమని నానామముచే ప్రసిద్ధికెక్కును.

శ్లో॥ అయోధ్యాయాం రామతీర్థే సరయూజల మధ్యగే ।
చైత్రస్నానం ప్రకుర్వాణా స్తేనరా మోక్షభాగినః॥ ౨౩॥

తా॥ అయోధ్యాపట్టణమందు రామతీర్థమనెడి సరయూనది జలములలో చైత్రమాసమందు స్నానముఁ జేసిన మనుష్యులు మోక్షమునొందెదరు.

శ్లో॥ యథామాఘః ప్రయాగేహి స్నాతవ్య సుఖమిచ్ఛతా ।
కార్తికోపి తథాకాశ్యాం పంచగంగా జలేస్మృతః॥ ౨౪॥ ద్వారకాయాం యథాప్రోక్తో వైశాఖో మాధవప్రియః । అయోధ్యాయాం రామతీర్థే తథా చైత్రో భవిష్యతి॥ ౨౫॥

తా॥ సుఖములను కోరువారు మాఘమాసములో ప్రయాగక్షేత్రమందు స్నానముఁ జేయవలయుననియు, కార్తికమాసములో కాశీక్షేత్రమందు పంచగంగా జలములలో స్నానముఁ జేయవలయుననియు విష్ణుప్రీతికరమగు వైశాఖమాసములో ద్వారకయందు స్నానముఁ జేయవలయుననియు నెట్లు చెప్పఁబడియున్నదో ఆప్రకారముగానే చైత్రమాసములో నయోధ్యాపట్టణమందుగల రామతీర్థజలములలో స్నానముఁ జేయవలయునని చెప్పఁబడెను.

శ్లో॥ సర్వేషామేవమాసానా మాదౌ శ్రేష్ఠోభవిష్యతి। చైత్రేమాసేతు సంప్రాప్తే సర్వేదేవా స్సవాసవాః । బహిర్జలం సమాశ్రిత్య తిష్ఠధ్వంహి మమాజ్ఞయా॥ ౨౬॥

తా॥ ఓ దేవతులారా! అన్నిమాసములలోను చైత్రమాసము మొదలు కాఁబట్టి శ్రేష్ఠమైనది. అందువలన చైత్రమాసము రాగానే యింద్రుఁడు మొదలగు సమస్తదేవతులును నాయాజ్ఞప్రకారము నదులు సరస్సులు తటాకములు కూపములు మొదలగు సమస్తమైన బహిర్వ్యాపకమగు జలములయందును మీరు సన్నిధానవర్తులై యుండుఁడు.

శ్లో॥ ఏవం హరిస్తాన్ మఘవా దికాన్ సురానుక్త్వాసురైస్తైశ్చ నమస్కృతోబభౌ । వృషేంద్రమారు హ్యాశివోనిజం స్థలం యయౌ సురాస్తేపియయుర్నిజం స్థలమ్॥ ౨౭॥

తా॥ ఇట్లు భగవంతుండగు శ్రీరామచంద్రుఁడు దేవేంద్రుఁడు మొదలగు సమస్త దేవతులతోను చెప్పఁగా వారందఱును రామచంద్రునకు నమస్కరించి సాంబమూర్తి వృషభవాహనము నెక్కి కైలాసమున కేగెను. దేవేంద్రుఁడు మొదలగు సమస్త దేవతులును స్వర్గమున కేగిరి.

శ్లో॥ తస్మాత్సర్వేషుమాసేషు ముఖ్యశ్చైత్రః ప్రకీర్త్యతే । మాసాదౌ ప్రథమస్సర్వైః ప్రోచ్యతేహి వరార్థకః॥ ౨౮॥

తా॥ అందువల్ల నన్నిమాసములో చైత్రమాసము ముఖ్యమైనది. ఇట్లు భగవంతుఁడు వరము నిచ్చుటచే మొదటి మాసమగు చైత్రము శ్రేష్ఠంబైనది.

శ్లో॥ ఏవం శిష్య యథాపృష్టం తథాతేవినివేదితం । కారణం చైత్రమాసస్య రామచంద్ర వరాదికమ్॥ ౨౯॥

తా॥ ఓ శిష్యుఁడా! నీ మనస్సునకు నేవిధముగా సందేహము కలిగి యడిగితివో. ఆ ప్రకారముగానే నీమనస్సునందుండెడి సంశయము పోవునట్లు చైత్రమాసము ముఖ్యమగుటకు కారణమును రామచంద్రుఁడు వరముల నిచ్చుటయు మొదలగునవి చెప్పితిని.

విష్ణుదాసఉవాచ॥ శ్లో॥ స్వామిన్ గురోత్వయా చైత్ర స్నానం పుణ్యతమస్మృతం । తత్కేనాచరితం పూర్వం కాసిద్ధిస్తత్ప్రభావతః॥ ౩౦॥ తత్సర్వం విస్తరేణైవ మమాగ్రేత్వం నివేదయ॥ ౩౧॥

తా॥ స్వామీ ఓ గురువా! పుణ్యప్రదమగు చైత్రమాస స్నానమును గుఱించి చెప్పితివి. అయితే దాని నెవరాచరించిరో యే విధముగా దానిఫలము నొందిరో దాని ప్రభావ మెట్టిదో యీవిషయ మంతయు పూర్వము జరిగిన రీతిగా నాకుఁజెప్పవలయునని విష్ణుదాసుఁ డడిగెను.

రామదాస ఉవాచ॥ శ్లో॥ సమ్యక్పృష్టం త్వయాశిష్య శృణు త్వం యన్మయోచ్యతే। మమతాతో నృసింహాఖ్యః పురాత్రాసీద్ద్విజోత్తమః॥ ౩౨॥

తా॥ రామదాసు చెప్పుచున్నాడు. ఓ శిష్యుఁడా! నీవుచేసిన ప్రశ్న యోగ్యముగా నున్నది నేను చెప్పెడు విషయమును వినుము. నృసింహుడనెడు నాతండ్రి పూర్వమందు నిక్కడుండెను.

శ్లో॥ తస్యైకో నియమశ్చాసీ త్ప్రత్యహం భూసురోత్తమం। ఏకమబ్జక క్షేత్రస్థం ద్విజమన్నార్థినం ప్రతి॥ ౩౩॥ స్నుషా స్త్రీపుత్ర తనయా దాసీదాసా దిభిర్యుతం। కుటుంబభోజనం తస్మై సంపూజ్యా న్నైర్ద్విధీయతాః॥ ౩౪॥

తా॥ ఆయనకు నొక్క నియమముకలదు. అదియే అబ్జకమను క్షేత్రమందు నివసించునట్టియు, అన్నము నపేక్షించియుండినట్టియు, నొక బ్రాహ్మణునకు భార్యా పుత్ర పుత్రికలు కోడలు దాసదాసీ జనము మొదలగు వారందఱకును నిత్యము భోజనము పెట్టి కుటుంబ పోషణఁ జేయుచుండెడివాఁడు.

శ్లో॥ లక్ష్మీనామ్నీతు మన్మాతా తావుభౌరామ తత్పరౌ। పుత్రోత్పత్తి మదృష్ట్వాతౌ వృద్ధౌ పుత్రార్థ ముద్యతౌ॥ ౩౫॥

తా॥ లక్ష్మీదేవియను నాతల్లియొక్క నామము. నాతల్లిదండ్రు లిరువురు శ్రీరాముని భక్తికలవారు. వారికి వృద్ధాప్యము వచ్చినప్పటికిని సంతానము కలుగనందున సంతాన నిమిత్తము ప్రయత్నముఁ జేయుచుండిరి.

శ్లో॥ స్వదోష పరిహారార్థ ముపాయం కర్తుముద్యతౌ। నివాసాఖ్యే పురే గత్వా దంపతీ మోహినీం శుభామ్॥ ౩౬॥ స్వీయేష్ట దేవతా

మంబాం పవరాతీరవాసినీం । దృష్ట్వాదేవ్యాశ్చ తౌసేవాం నిత్యం తత్రప్రచక్రతుః॥ ౩౭॥

తా॥ సంతానము కలుగనందుకు తమకు నేదైన దోషముండు నని యూహించి యాదోషము పోగొట్టుకొనుటకు నివాసమనెడు పట్టణమునకు వెళ్లి యచ్చట ప్రవరా నదీతీరమందుండునట్టియు, తమకు కులదేవతయగు మోహినీదేవిని నిత్యము సేవించుచుండిరి.

శ్లో॥ గతేబహుతిథేకాలే వరదాసామహాలయా । ప్రసన్నాతం ద్విజంభూత్వా ప్రాహతద్దోషశాంతయే॥ ౩౮॥

తా॥ ఇట్లు చాలాకాలమా మోహినీదేవికి సేవజేయుచుండగా నాబ్రాహ్మణునకు ఆమోహినీదేవి వరమునిచ్చుటకు ప్రత్యక్షమైవారి యొక్క దోషము పోవుటకు నిట్లుఁజెప్పెను.

శ్లో॥ హేనృసింహమహాబుద్ధే గచ్ఛాయోధ్యాపురీంప్రతి । తత్ర వైసరయూతీరే రామతీర్థే మహత్తమే॥ ౩౯॥ చైత్రేమాసివసంతర్తౌ యదా స్యాన్మీనగోరవిః । చైత్రస్నానం మాసమేకం కురుతత్ర ద్విజోత్తమ॥ ౪౦॥

తా॥ నృసింహుఁడను యోబ్రాహ్మణోత్తమా! నీవు విశేష బుద్ధిశాలివి గనుక జెప్పెదను వినుము. అయోధ్యాపట్టణము వద్ద సరయూనది కలదు. దానియందు రామతీర్థమను శ్రేష్ఠంబగు క్షేత్రము కలదు. అక్కడకు వెళ్లి వసంతరుతువునందు చైత్రమాసములో సూర్యుఁడు మీనరాశిని ప్రవేశించియుండగాను లేక చైత్రమాసము నెలదినములు నక్కడ స్నానముఁజేయుము.

శ్లో॥ పాతకం సకలంత్యక్త్వా పుత్రంప్రాప్స్యసి నుత్తమం । ఇతి దేవ్యావచశ్శ్రుత్వా ద్విజశ్చింతాపరస్తదా॥ ౪౧॥ యయౌమార్గే హృదిధ్యాయ న్నయోధ్యాఖ్యాం పురీం శుభాం॥ ౪౨॥

తా॥ నీకు గల సమస్త పాపము నశించును. శ్రేష్ఠుండగు పుత్రునిఁబొందగలవు. ఇట్లు చెప్పిన మోహినీదేవియొక్క వాక్యములను విని యాబ్రాహ్మణుఁడు విచారపడుచు మార్గమందు

మనస్సులో భగవంతుని ధ్యానింపుచు నయోధ్యాపట్టణమును గూర్చి వెళ్లుచుండెను.

శ్లో॥ చింతయా పరయా వ్యాప్తః కథంగంతుంహి శక్యతే। మయోధ్యాపురీ దూర మితఃకష్టంచ జీవితమ్॥ ఇతి చింతాయుతో మార్గే క్వచి త్తిష్ఠన్ క్వచిత్ స్ఖలన్। భార్యాయాశ్చ కరంధృత్వా వృద్ధశ్చైవం యయౌద్విజః॥ ౧౪॥

తా॥ అయోధ్యాపట్టణ మిచ్చటకు చాలా దూరము కలదు. మేము మిక్కిలి వృద్ధులము. ఏవిధముగా నచ్చటికి వెళ్లగలము. ఈ విధముగా విచారపడుచు మార్గములో నడువలేక నొకచోట గూర్చుండుచు నొకచోట పడిపోవుచు భార్యయొక్క హస్తమును పట్టుకొని కొంతదూరము నడుచుచు నీవిధముగా నాముసలిదంపతులు మార్గమందు నతికష్టముగా నడుచుచుండిరి.

శ్లో॥ ఏవం గోదావరీ తీరం గత్వా స్నాత్వా ద్విజోత్తమః। రామమూర్తిం పురస్థాప్య పూజయా మాసభక్తితః॥ ౧౫॥

తా॥ ఇట్లు కష్టముగా నాబ్రాహ్మణోత్తముఁడు గోదావరీ తీరమునకు వెళ్లి స్నానముఁజేసి రామచంద్రవిగ్రహమును దగ్గరనుంచుకొని భక్తితోఁబూజించెను.

శ్లో॥ తావత్తస్మై ప్రసన్నోభూ ద్రామో దేవ్యాః ప్రసాదతః। ద్విజంప్రాహ రఘుశ్రేష్ఠో భోనృసింహ ద్విజోత్తమ॥ ౧౬॥ మాయోధ్యాం త్వమితో గచ్ఛ శృణుమేవచనం శుభమ్॥ ౧౭॥

తా॥ ఇట్లు పూజించుటచేతను మోహినీదేవి యొక్క వరము చేతను ఆ శ్రీరామచంద్రుఁడు ప్రత్యక్షమై ఓ బ్రాహ్మణోత్తమా! నృసింహుఁడా! శ్రేయస్కరమగు నేజెప్పెడి వాక్యములను వినుము. అయోధ్యాపట్టణమునకు నీవు వెళ్లనక్కఱలేదు.

శ్లో॥ ఇతఃపూర్వే హ్యదూరంహి యోజనత్రయ సంమితం। ప్రతిష్ఠానా భిధంక్షేత్రం గోదాయా ఉత్తరేతటే॥ తత్రాస్తి రామతీర్థంహి మన్నామ్నాచ మయాకృతమ్॥ ౧౮॥

తా॥ ఇక్కడకు దగ్గిరలో మూఁడామడదూరమందు గోదావరీ నదియొక్క యుత్తరతీరమందుఁ బ్రతిష్ఠానమనియెడు క్షేత్రముకలదు. అక్కడ నాచే నేర్పరచఁబడినదియు నాపేరుతోఁ బ్రసిద్ధికెక్కిన రామ తీర్థమనునది యొక పుణ్యతీర్థముకలదు.

శ్లో॥ తత్రత్వంగచ్ఛవిప్రేంద్ర స్నానం శీఘ్రంహిభార్యయా। చైత్రమాసే వసంతర్తౌ యదాస్యాన్మీనగోరవిః॥ ౪౯॥ తదా కురువిశే షేణ పూజయిత్వాచ మాంశుభం। పాపక్షయః పుత్రలాభో భవి ష్యతి నసంశయః॥ ౫౦॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! అక్కడకువెళ్లి వసంతర్తువులోఁ జైత్రమాసమందు సూర్యుఁడు మీనసంక్రమణమునందుఁ బ్రవేశించి యుండగా నారామతీర్థములో నీవు నీభార్యయుభయులు స్నానముఁ జేసి శ్రేయస్సుల నొసగునట్టి నన్ను భక్తితో విశేషముగాఁ బూజిం చిన యెడల నీపాపములు నశించును. నీకు పుత్రుఁడు కలుగును. ఇందు విషయమై యేమియు సందేహము లేదు.

శ్లో॥ ఇత్యుక్త్వారఘువీరస్తు తత్రైవాంతరధీయత। యత్రగంగా ప్రవాదేరామః ప్రసన్నోభూద్ద్విజాయహి॥ ౫౧॥ తస్మాత్సవై రామప్రాదో నామ్నా సర్వత్రకీర్త్యతే। తదావిప్ర వచనాద్విప్రః ప్రతిష్ఠానం పురం యయౌ॥ ౫౨॥

తా॥ ఇట్లు శ్రీరామచంద్రుఁడా బ్రాహ్మణునితోఁ జెప్పి యంత ర్థాన మాయెను. గంగాతీరమందు ఎక్కడ రామచంద్రుఁడా బ్రాహ్మణునకుఁ బ్రత్యక్షమయ్యెనో అది రామతీర్థమని యంతటఁ బ్రసిద్ధికెక్కియున్నది. అనంతర మాబ్రాహ్మణుఁడు శ్రీరామచంద్రుని యొక్క వాక్యానుసారముగాఁ బ్రతిష్ఠానపట్టణమునకు వెళ్లెను.

శ్లో॥ మాసమేకంచ వైస్థిత్వా చైత్రస్నానం చకారహ। సూ ర్యోదయే సముత్థాయ కృతశౌచాది సత్క్రియః॥ ౫౩॥ స్నాత్వా తస్మిన్ రామతీర్థే సరయూ సంగమాన్వితే। రామచంద్రం స్వర్ణ గిరౌ పూజయామాసభక్తితః॥ ౫౪॥

తా॥ ఇట్లు వెళ్ళి సూర్యోదయ కాలమునకు లేచి శౌచాది క్రియలను దీర్చుకొని స్నానముఁ జేయుచుండెను. ఇట్లు నెలదినములు సరయూనది కలిసియుండెడి యారామతీర్థమునందు సూర్యోదయ కాలమునకు స్నానముఁజేయుచు నక్కడ సువర్ణగిరియందు నివాస మేర్పరచుకొని భక్తితో శ్రీరామచంద్రుని బూజింపుచుండెను.

శ్లో॥ ప్రదక్షిణాః స్వర్ణగిరే శ్చకార నవప్రత్యహం । నవపు ష్పైశ్చ నైవేద్యైః పూజయా మాసరాఘవమ్॥ ౫౫॥

తా॥ ఆసువర్ణగిరికి నిత్యము తొమ్మిది పర్యాయములు ప్రద క్షిణములు జేయుచు శ్రీరామచంద్రుని తొమ్మిది పుష్పములచేఁ బూజింపుచు నివేదనలు మొదలగునవియు భక్తితోఁజేయుచుండెను.

శ్లో॥ చైత్రశుక్ల తృతీయాయా యావద్వైశాఖసంభవా । తృతీ యాశీతలాగౌరీ స్నానం చక్రేద్విజప్రియా॥ ౫౬॥

తా॥ ఆ బ్రాహ్మణుని యొక్క భార్యయుఁ జైత్రశుద్ధ తదియ మొదలు వైశాఖ శుద్ధతదియ పర్యంతము శీతలాగౌరీదేవి తృప్తికొఱకు స్నానముఁ జేయుచుండెను.

శ్లో॥ ఏవం మాసం వ్రతంకృత్వా సద్విజస్తుష్ట మానసః । అబ్జ కం ప్రతిమార్గేణ యయాలక్ష్మ్య సమన్వితః॥ ౫౭॥

తా॥ ఆ బ్రాహ్మణుఁడిట్లు నెలదినములు వ్రతమాచరించి సంతు ష్టాంతరంగుఁడై తన భార్యయగు లక్ష్మీదేవితోఁగూడ అబ్జకగ్రామ మునకు వెళ్లుచుండెను.

శ్లో॥ యావన్మార్గే ద్విజోగచ్ఛ త్తావద్దృష్ట స్త్రిభిర్వరైః । పిశాచైఃక్షుత్తృషాక్రాంతై స్తానుద్ధృత్య సభార్యయా॥ ౫౮॥ యయా న్స్వనగరంరమ్యం గోదానాభి విరాజితం । చైత్రస్నాన ప్రభావేన జాతస్తస్మా త్సుతస్త్వహమ్॥ ౫౯॥

తా॥ ఇట్లు ఆ బ్రాహ్మణుఁడు మార్గములోఁ బోవుచుండగా నాకలిదప్పికలతోఁ బాధపడుచుండెడి ముగ్గురు గొప్ప పిశాచములు దారిలో నడ్డము రాగా వారిని నశింపుజేసి భార్యతోఁగూడ గోదావ మను తమ నగరమునకు వెళ్లిరి. ఇట్లు చైత్రమాసములో స్నానముఁ

జేసిన ప్రభావముచే నాదంపతులకు నేను పుత్రునిగా జనియించితిని. ఇది నాజన్మకారణము.

శ్లో॥ తస్మాన్మయా తే కథితం వరంహి స్నానం మధౌ తే సరయూజలేవై । సాకేతపుర్యాం వరరామతీర్థే భుక్తిప్రదం మోక్షదముత్తమంచ॥ ౬౦॥

తా॥ ఆకారణమువలన అయోధ్యాపట్టణమువద్ద సరయూనదీతీరమందుండెడి యుత్తమమగు రామతీర్థమునందుఁ జైత్రమాసమందు స్నానముఁజేసిన భుక్తియు, ముక్తియు కలుగును. అందువలన నిది శ్రేష్ఠముగాఁ జెప్పఁబడెను.

విష్ణుదాసఉవాచ॥ శ్లో॥ కథం పిశాచయోన్యాస్తే ముక్తావిప్రేణానైతత్రయః । కస్మాత్పాపాచ్చ తేసర్వే పైశాచీంయోనిమాశ్రితాః॥ ౬౧॥ తత్సర్వం విస్తరేణైవ శ్రోతుమిచ్ఛామిత్వన్ముఖాత్॥

తా॥ ఆముగ్గురు పిశాచములగుటకుఁ గారణమేమి. ఏ పాపమువలనఁ బిశాచములైరి. ఆ బ్రాహ్మణునివలన నెట్లు విముక్తులైరి. వారి వృత్తాంతమంతయు సవిస్తరముగాఁ జెప్పిన వినవలయునని కుతూహలముగా నున్నదని విష్ణుదాసుఁడడిగెను.

శ్రీరామదాస ఉవాచ॥ శ్లో॥ శృణుశిష్య ప్రవక్ష్యామి రంభానామ్నీవరాప్సరా । చైత్రేస్నాత్వా వరాయోధ్యా సరయూనిర్మలే జలే॥ ౬౨॥ ఆర్ద్రవస్త్రయుతా చారు హాస్యాలంకార మండితా । గృహీత్వా సరయూతోయం రత్నకాంచన నిర్మితే॥ ౬౩॥ పాత్రే రామేశ్వరం సేతుం ద్రష్టుం మానేనసాజవాత్ । యయావాకాశమార్గేణ పిశాచా యత్ర తేత్రయః॥

తా॥ గురువగు రామదాసు చెప్పుచున్నాడు. ఓ శిష్యుఁడా! ఆ పిశాచములయొక్క వృత్తాంతమును జెప్పెదను వినుము. రంభయనెడు సర్వస్త్రీలలోను సుందరమగు అప్సరస్త్రీ కలదు. ఆమె అయోధ్యాపట్టణమందుండెడి సరయూనదియందుఁ జైత్రమాసములో స్నానముఁజేసి సమస్తాభరణములతోను, చిఱునవ్వుతోను గూడి తడిబట్టలనే కట్టుకొని రత్నములు గూర్చఁబడిన బంగరు పాత్రయందు

ఆ సరయూనదీ జలములనుంచుకొని యెవరితోను మాట్లాడకుండా మౌనముగానుండి రామేశ్వరమును సేతువును జూచు నిమిత్తము మహావేగముతో నాకాశమార్గమునందు బోవుచుండగా దారిలో ముగ్గురు పిశాచములు రంభనుజూచిరి.

శ్లో॥ తత్రార్ద్ర వస్త్రచాంచల్యా ద్బిందుభిః ప్రోక్షితాశ్చ తే॥ ౧౭॥ క్రూరస్వభావము స్సృజ్య చాశ్చర్యం పరమంయయుః। పూర్వ జన్మాను స్మరణ మభూత్తేషాం తదాద్విజ॥ ౧౮॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! ఇట్లు రంభ తడి బట్టలతో నాకాశమందు వెళ్లుచుండగా గాలివీచుటచే ఆ తడిబట్ట కదలుటవలన జలబిందువు లీపిశాచముల మీఁదఁబడినవి. అప్పుడా ముగ్గురు పిశాచ ములకును దుష్టస్వభావముపోయి మంచి స్వభావముకలిగి పూర్వజన్మ వృత్తాంతముఁగూడఁ దెలియునట్టి జ్ఞానముకలుగుటచే మిక్కిలి యాశ్చ ర్యము నొందిరి.

శ్లో॥ విస్మయా విష్టచిత్తాస్తే తాంధృష్ట్వా ప్సరసందివి। బహు ధా ప్రార్థయామాసు స్తాసాపప్రిచ్ఛ సంజ్ఞయా॥ ౧౯॥ కస్మా ద్యూయం పిశాచాహి జాతా స్తత్కథ్యతాంమమ। ఇతి తత్కార కృత్సంజ్ఞా ప్రేరితాస్తే త్రియ స్తదా॥ ౨౦॥

తా॥ ఇట్లు పూర్వజ్ఞానము కలుగుటచే నాశ్చర్యమనస్కులై యాకాశమునందు వెళ్లుచుండెడి రంభను జూచి యనేక విధములుగఁ బ్రార్థించగా నామె మౌనము నవలంబించుటచే మాట్లాడక మీకు పిశాచజన్మ మెందుకు కలిగినదో చెప్పుడని యాముగ్గురు పిశాచములను జేతి సంజ్ఞతో నడిగెను.

శ్లో॥ తేషుద్వా వర్తమానంహి కథయా మాసుతుర్బృతాం। శృణుభామిని చావాంహి పూర్వజన్మ నిభూసురాత్॥ ౨౧॥ వరజా యాం సముత్పన్నౌ శ్రోత్రియాద్ధర శర్మణః। ఉభావధ్యయనం కర్తుం కించి న్నారాయణాహ్వయమ్॥ ౨౨॥ మమాప్ర యాతో మత్వా గురుం తత్రైవతస్థతుః॥

తా॥ ఆముగ్గురు పిశాచములలో నిద్దరు తమ పూర్వవృత్తాంత మిట్లు చెప్పఁదొడగిరి. ఓ రంభా! పూర్వజన్మమందు శ్రోత్రియుం డగు హరశర్మయనెడు బ్రాహ్మణునియొక్క ధర్మపత్నియందు మేము పుత్రులముగా జనియించి నారాయణుఁడనె డొక బ్రాహ్మణుని వద్ద వేదముఁజెప్పుకొనుటకు మేమిరువురము వెళ్లి యాగురువునకు శుశ్రూషఁ జేయుచు నక్కడ నుంటిమి.

శ్లో॥ నారాయణ సుతాంచారు హాస్యాం చంద్రనిభాననాం। దృష్ట్వా పరస్పరం మైత్ర్యం బహుధాప్రార్థ్యతాం స్త్రియమ్॥ ఆనా భ్యాం కిలసాభుక్తా తత్ జ్ఞాతం గురుణాచిరాత్॥ ౨౩॥

తా॥ మాగురువగు ఆనారాయణునకుఁ జంద్రునివంటి ముఖము గల సుందరమగు నొక కుమార్తె కలదు. ఆమెనుజూచి మేమిరువు రము మోహించి విశేషముగా నామెను ప్రార్థించగా నంగీకరించు టచే నామెతోఁ జాలకాలము సంభోగముఁ జేయుచుంటిమి. ఈ వృత్తాంతము చాలాకాలమునకు మాగురువునకుఁ దెలిసినది.

శ్లో॥ ఆవాభ్యాంచ దదౌశాపం తస్యైచాప్య శపత్ క్రుధా। యువాంచాపి కుమారీయం పిశాచత్వంగ మిష్యథ॥ ౨౪॥

తా॥ అప్పుడు కోపించి మాయుభయులను తన కుమార్తెను పిశాచజన్మ మెత్తవలయునని శపించెను.

శ్లో॥ తతోస్మాభి స్త్రిభి స్తంతు మునిం నత్వా పునః పునః। శాపస్యాంత స్తతోలబ్ధ స్తచ్ఛృణుష్వ మనోరమే॥ ౨౫॥ చైత్రమాసే నృసింహాఖ్యః కశ్చిద్విప్రశ్చకాననే। దదాతి స్నానజం పుణ్యం తదో ద్ధారో భవిష్యతి॥ ౨౬॥

తా॥ ఓ రంభా! మేము ఆయన కుమార్తె మేము ముగ్గురము ఆయనకు నమస్కరించి శాపవిముక్తిని గుఱించి యనేక విధములు ప్రార్థించగాఁ గొంతకాలమునకు నృసింహుఁడనెడు బ్రాహ్మణోత్త ముఁడు ఈయడవికి రామతీర్థమునందు చైత్రమాసములో స్నాన ముఁజేయుటకు వచ్చి స్నానముఁజేసి యాపుణ్యము మీకు నొసగును. అందువల్ల మీకు శాపవిముక్తికలుగును. అని మాగురువుగారుచెప్పిరి.

శ్లో॥ ఏవం జాతాః పిశాచాహి వయం త్వద్వస్త్ర బిందుభిః ।
ప్రోక్షితాస్మోద్యతెజ్యాతా పూర్వజన్మ స్మృతిస్శుభ॥ ౭౭॥

తా॥ మేము పిశాచములగుటకు కారణమిది. ఇప్పుడు నీవు ధరించిన తడిబట్టయొక్క బిందువులు మామీద పడుటచే మాదుష్ట స్వభావముపోయి పూర్వజన్మ స్మృతి సంభవించినది.

శ్లో॥ సాతేషాం వచనంశ్రుత్వా జ్ఞాత్వా శాపస్య మోక్షణం ।
సాంత్వయిత్వా కరేణైవ శీఘ్రం సనృహరిఃస్త్రియా॥ ౭౮॥ ఆగమిష్యతి మాచింతాం కురుతేతి వరాంగనా । యయౌ రామేశ్వరం శీఘ్రం పూజయిత్వా గతాదివమ్॥ ౭౯॥

తా॥ ఆ యప్సరస్త్రీ వారు చెప్పిన మాటలను విని శాపవిముక్తియు నెఱింగి చేతిసంజ్ఞచేతనే వారికి ప్రియమునుజూపించి నృసింహుడనెడు ఆ బ్రాహ్మణుఁడు భార్యతోఁగూడ త్వరలోనే రాగలడు. కాఁబట్టి మీరు విచారపడవద్దు. అని వారితోఁజెప్పి గౌరవించి రామేశ్వరమునకు ఆరంభ శీఘ్రముగా వెళ్లెను.

శ్లో॥ చైత్రమాసే వ్యతిక్రాంతే మార్గేణ సనృహరిర్ద్విజః ।
భార్యయా సహితోదృష్టః పిశాచైస్తైః పితామహ॥ ౮౦॥

తా॥ అనంతర మానృసింహుఁడనెడు బ్రాహ్మణుఁడు భార్యతోఁగూడ చైత్రమాసము వెళ్లిన పిమ్మట వచ్చుచుండగా నాతండ్రిని మార్గములో పిశాచములు చూచిరి.

శ్లో॥ స్థిత్వా దూరంచతే సర్వే తమూచుర్నృహరిం ద్విజం ।
నైజంవృత్తం సమస్తంహి శాపస్యాపి విమోక్షణమ్॥ ౮౧॥

తా॥ ఆ పిశాచములు దూరముగానుండి యాబ్రాహ్మణునితోఁ దమకు సంభవించిన శాప కారణము తిరిగి శాప విమోచనకారణము గల తమ వృత్తాంతమంతయు నాబ్రాహ్మణునితోఁ జెప్పిరి.

శ్లో॥ తచ్ఛ్రుత్వా నృహరిర్విప్రస్తాన్ప్రోవాచ ముదాన్వితః ।
మాభేత్తవ్యం పిశాచత్వా ద్యథాశంభు ద్విజేనసః॥ ౮౨॥ రాక్షసో మోచితఃపూర్వం మోక్షయిష్యామం తథా॥

తా॥ ఇట్లు పిశాచములు చెప్పిన మాటలను ఆ నృసింహుఁడు విని సంతోషించి ఓ పిశాచములారా! మీకు పిశాచజన్మ వచ్చినదని భయపడవద్దు. పూర్వము శంభుఁడను బ్రాహ్మణునిచే నొక రాక్షసునకు శాపవిముక్తిఁ జేసెదను. అని బ్రాహ్మణుఁడు చెప్పెను.

పిశాచఉవాచ॥ శ్లో॥ కశ్శంభుశ్చ కదాముక్తో రాక్షసః కఃసవిస్తరం। కథయస్వ ద్విజశ్రేష్ఠ కృపాంకృత్వాతు కౌతుకాత్॥ ౮౩॥

తా॥ శంభుఁడను బ్రాహ్మణుఁడెవరు. రాక్షసుఁడు యెవరు. ఎప్పుడు ఆయనవల్ల ముక్తికలిగినది. ఓ బ్రాహ్మణోత్తమా! నాయందు దయవుంచి సంతోషచిత్తముతో నేనడిగినదంతయు సవిస్తరముగాఁ జెప్పుమని యానృసింహుని పిశాచ మడిగెను.

నృసింహఉవాచ॥ శ్లో॥ శృణుధ్వం కథయిష్యామి యద్వృత్తంచ పురాతనం। శివ కాంచీపురీ మధ్యే కశ్చిద్విప్రశ్శుచి వ్రతః॥ ౮౪॥ శంభునామా చిరంకాలం తస్థౌసచ స్వభార్యయా॥ ౮౫॥

తా॥ నృసింహుఁడు చెప్పుచున్నాఁడు. ఓ పిశాచములారా! పూర్వము జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పెదను వినుఁడు. అది యెట్లనఁగా పూర్వము శివకంచి యను పట్టణమందు శంభుఁడను బ్రాహ్మణుఁడు తన భార్యతోఁగూడ చాలా కాలమునుండి కాపురముఁ జేయుచుండెను.

శ్లో॥ సకస్మింశ్చ దినేవిప్ర శ్చైకాంబర శివాంతికే। పౌరాణిక ముఖాచ్చైత్ర మాసమాహాత్మ్య వర్తినీమ్॥ ౮౬॥ కథాం శ్రోతుం సమాయాత స్తత్ర శ్రుత్వా మహత్ఫలం। అయోధ్యాయాంహి చైత్రస్య స్నానా త్కైవల్యదాయకమ్॥ ౮౭॥

తా॥ ఆ బ్రాహ్మణుఁ డొకానొక దినమందు ఏకాంబరేశ్వరుఁడను శివాలయములో నొక పురాణవేత్త చైత్రమాస మాహాత్మ్యము గల పురాణకథను చదువుచుండగాఁ వినుటకు నక్కడకు వెళ్లెను. ఆ పురాణములో నాదినమందు వినినకథ యేమనఁగా చైత్రమాసములో నయోధ్యాపట్టణమున సరయూనదిలో స్నానముఁ జేసిన ముక్తి కలుగునని విశేషఫలముఁ జెప్పఁబడినది.

శ్లో॥ తతో బహుగతే కాలే సంస్మరన్తాం కథాంశుభాం ।
జ్ఞాత్వా సమాగతం చైత్రం స్వగృహాన్నిర్గత స్తదా॥ ౮౮॥ భార్యయా సహితో విప్ర శ్శనైర్మార్గేణ వైయయౌ॥

తా॥ పిమ్మట కొంతకాలము జరిగిన తర్వాత పూర్వము శివాలయములో తాను విన్నకథ జ్ఞాపకమురాగా చైత్రమాసము వచ్చినప్పుడు తాను తన భార్యయు నిద్దఱుకలిసి యిల్లువెడలి మెల్లగా నడచుచు నాక్షేత్రమునుగూర్చి మార్గమున బోవుచుండిరి.

శ్లో॥ తీర్త్వాతాంజాహ్నవీం రమ్యాం యావదగ్రే సగచ్ఛతి ।
తావద్దృష్టోహి భిల్లేన కర్కశాఖ్యేన కాననే॥ ౮౯॥

తా॥ ఇట్లు బోవుచుండగా ముందు గంగానది సమీపించినది. దానిని దాటి యావలితీరమునకు వెళ్లిరి. అచ్చట కర్కశుఁడనునొక బోయవాఁడు యాబ్రాహ్మణదంపతులను జూచెను.

శ్లో॥ గృహీత్వా సశరంచాపం ధర్షయిత్వాచ భూసురం ।
లులుంఠకర్కశః క్రూరో వస్త్రైకేన తంద్విజమ్॥ ౯౦॥ ముమోచ తస్య పాథేయం గృహీత్వా సకలం బహు॥ ౯౧॥

తా॥ ధనుర్బాణములను ధరించియున్నట్టి యా బోయవాఁడా బ్రాహ్మణుని పట్టుకొని క్రిందపడవేసి పొర్లించి కట్టుకొనిన నట్టి వస్త్రము నొక్క దానిని మాత్రముంచి యాబ్రాహ్మణుఁడు దారి బత్యమును తెచ్చుకొనిన యావత్తు బియ్యము పప్పు మొదలగు సామగ్రిని తీసికొని విడిచిపెట్టెను.

శ్లో॥ ద్విజోపి ప్రార్థయామాస కర్కశంచ పునః పునః ।
వస్త్రాదికం గృహాణత్వం భక్ష్యపిష్టం దదస్వమామ్॥ ౯౨॥ తత్తస్య వచనం శ్రుత్వా ముక్త్వాతద్వస్త్ర బంధనం । సర్వం దదశేపాథేయం నానావిధమ నుత్తమమ్॥ ౯౩॥

తా॥ ఓ బోయవాఁడా! నావద్దనుండెడి వస్త్రములు మొదలగు వానినన్నింటిని తీసికొని బత్యమునకు తెచ్చుకొనిన పిండి మొదలగు వానిని మాత్రము విడిచిపెట్టమని మాటిమాటికి వానిని ప్రార్థించఁగా నామాటలను విని యా బోయవాఁడు ఆబ్రాహ్మణునియొక్క

బట్టలమూటలనన్నింటిని విప్పి యామూటలలోనిదిగాక మఱియు నిత రములగు ననేక విధములైన పాథేయమునుకూడ చూచెను.

శ్లో॥ తస్మిన్ దదర్శసవ్యాధో దశరంభా ఫలానివై । అపక్వా న్యతిశుష్కాణి తతశ్చిత్తే విచారయేత్॥ ౧౪॥

తా॥ ఆ మూటలో పండనవియు నెండియున్నట్టి పదియఱటి పండ్లను ఆబోయవాఁడు చూచి తనమనస్సులో నిట్లుఆలోచించెను.

శ్లో॥ ఏతైఃఫలై ర్నమేకార్యం జానామి బ్రాహ్మణోత్తమం । తహీనదాస్యా మ్యహందీనం క్షుధాక్రాంతంచ సస్త్రీకమ్॥ ౧౫॥ ఇతి నిశ్చిత్య సవ్యాధో దదౌతాని ద్విజన్మనే॥

తా॥ ఎండి చెడిపోయినట్టి యీ యఱటిపండ్లు నాకు నెంతమాత్రముపయోగించవు. ఈబ్రాహ్మణుఁడు భార్యయు చాలా ఆకలితో నుండి నన్ను మిక్కిలి వేఁడుకొనుచున్నాఁడు. మిక్కిలియుత్తముఁడుగా కనుపించుచున్నాఁడు కాఁబట్టి ఆయనకేయిచ్చుటయుచితమని యాలోచించి యాపండ్ల నాబ్రాహ్మణున కిచ్చెను.

శ్లో॥ గృహీత్వా భక్షయద్విప్రః ప్రారంభే భార్యయాదదా । తదరంభా ఫలదానేన కర్కశస్య తధాశుభా॥ ౧౬॥ జాతాబుద్ధిః క్షణా దేవ సాత్వికీ కూరతాంగతా॥ ౧౭॥

తా॥ అప్పుడా బ్రాహ్మణుఁడు ఆ యఱటిపండ్లను కొన్ని తన భార్యకిచ్చి కొన్ని తానుభక్షించెను. ఇట్లు యరటిపండ్ల నిచ్చుటచే క్షణకాలములోనే బోయవానికుండెడి దుష్టబుద్ధిపోయి యోగ్యమగు సాత్వికబుద్ధి యంకురించెను.

శ్లో॥ ఏవం పిశాచాస్సకలా స్తతః పరంభిల్లాయతస్మై శుభబుద్ధి రాసీత్ । సమాగతం చాత్రకుతఃసపృష్టవాన్ విప్రం సవైప్రాహ వనేచ కర్కశః॥ ౧౮॥

తా॥ ఓ పిశాచములారా! ఇట్లు బోయవానికి మంచిబుద్ధికలిగిన పిమ్మట నో బ్రాహ్మణోత్తమా! నీవు యెక్కడనుండి వచ్చుచుంటివి. ఎక్కడకు నీయడవిలోపోయెదవు. చెప్పుమని యాబ్రాహ్మణుని బోయవాఁడడిగెను.

శంభురువాచ॥ శ్లో॥ కాంచీపుర్యా స్సమాయాతో గమ్యతే యోధ్యకాంపురీం । చైత్రమాసే వగాహార్థం సరయూ నిర్మలేజలే॥ ౯౯॥ ఇతి విప్రవచశ్శృత్వాపునః పప్రచ్ఛకర్కశః॥

తా॥ అయోధ్యాపట్టణమందు గల సరయూనదిలో గల సకల పాపహరమైన జలములయందు చైత్రమాసములో స్నానముఁజేయుటకు నయోధ్యాపట్టణమునుండి వచ్చుచున్నానని యాబ్రాహ్మణుఁడు చెప్పఁగా విని తిరిగి యాశంభుని కర్కశుడిట్లు యడుగుచున్నాఁడు.

శ్లో॥ కిం లభ్యతేహి స్నానేన తన్మేవద సవిస్తరమ్॥ ౧౦౦॥ పునఃప్రాహ సవిప్రేంద్రః కర్కశం భక్తితఃఫలం । స్నానేనమధుమాసేహి రఘునాథః ప్రసీదతి॥ ౧౦౧॥

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! సరయూనదియందు చైత్రమాసములో స్నానముఁజేయుటవలన నేమి ఫలము సంభవించునో నాకు సవిస్తరముగాఁ జెప్పుమని యాబోయవాఁడడుగఁగా నా బ్రాహ్మణుఁడు చెప్పుచున్నాఁడు. ఓ బోయవాఁడా! చైత్రమాసములో స్నానముఁజేయుటచే శ్రీరామచంద్రమూర్తి సంతోషించి యనుగ్రహముకలవాఁడగుచున్నాఁడు.

శ్లో॥ ప్రసాదాత్సకలాన్ భోగాన్ లభంతే మానవాభువి । అంతే మోక్షోపిభోభిల్ల లభతే నాత్రసంశయః॥ ౧౦౨॥

తా॥ మఱియు శ్రీరామచంద్రమూర్తి యొనుగ్రహము కలిగిన యెడల భూలోకములో మనుష్యులు సమస్తభోగముల నొందెదరు. ఓ బోయవాఁడా! మరణించిన పిమ్మట మోక్షమునుకూడ పొందగలరు. ఈవిషయమై యెంతమాత్రము సందేహములేదు.

శ్లో॥ ఇతి విప్రవచః శ్రుత్వా పునః పప్రచ్ఛకర్కశః । మోక్ష స్వరూపం కథయ కృపాంకృత్వా మమోపరి॥

తా॥ ఇట్లు చెప్పిన యాబ్రాహ్మణుని మాటలనువిని నాయందు దయకలిగి మోక్షమనఁగా నెటువంటిదో చెప్పుమని కర్కశుఁడు తిరిగి బ్రాహ్మణు నడిగెను.

శ్లో॥ తత్తస్య వచనంశ్రుత్వా పత్నీం ప్రాహద్విజోత్తమః। పశ్య పశ్య వరారోహే కౌతుకం మహదద్భుతమ్॥ ౧౦౪॥ యదన్నంభా ఫల దానేన చైత్రేమాసి వరాననే। అయం క్వభిల్ల జాతీయః క్వప్రశ్నశ్చే దృశశ్శుభః॥ ౧౦౫॥ మోక్షస్వరూప జ్ఞానార్థకం తస్మాద్దానం ప్రశస్యతే। ఇత్యుక్త్వాతాంప్రియాంవిప్రః కర్కశంప్రాహసాదరమ్॥౧౦౬॥

తా॥ ఇట్లు ఆ బోయవాఁడడుగఁగా నా బ్రాహ్మణుఁడు విని తన భార్యతోఁ నిట్లు చెప్పుచున్నాఁడు. ఓ చిన్నదానా! యొక యాశ్చర్యము కలిగినది వింటివా. అది యేమనఁగా దుష్టస్వభావము గల బోయవాని జాతి యెక్కడ. ఎవరును తెలిసికొనుటకు సాధ్యము కాని మోక్షవిషయకమైన ప్రశ్న యెక్కడ. ఇట్టి బుద్ధి కలుగుటకు నఱటిపండ్లను తిరిగి మనకునిచ్చుటచే సంభవించినది కాఁబట్టి దానము మిక్కిలి మంచిది యని భార్యతోఁజెప్పి కర్కశుఁడను ఆబోయవాని తోఁ నాబ్రాహ్మణుఁడిట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ సాధుసాధు మహావ్యాధ సమ్యక్ప్రశ్నః కృతస్త్వయా। ఇదానీం ప్రోచ్యతేమోక్ష స్వరూపం తన్నిశామయ॥ ౧౦౭॥

తా॥ ఓ కిరాతుఁడా! నీవు వేసిన ప్రశ్న మిక్కిలి యోగ్యము గానున్నది. ఆ మోక్షస్వరూపమెటువంటిదో చెప్పెదను సావధానముగా వినుము. అని చెప్ప నుపక్రమించెను.

శ్లో॥ సమోక్షస్త్వంహి జానీహి యతోనాస్తి పునర్భవః। ఇతి విప్రవచశ్శ్రుత్వా పునః పప్రచ్ఛకర్కశః॥ ౧౦౮॥ తస్య ప్రాప్తి ర్యథాస్యాన్మే తన్మేవద ద్విజోత్తమ॥

తా॥ ఓ బోయవాఁడా! దేనివలన నీకు తిరిగి జన్మసంభవించదో అదియే మోక్షమని తెలిసికొనుమని యాబ్రాహ్మణుఁడు చెప్ప గావిని ఓ బ్రాహ్మణోత్తమా! అది యెట్లు నాకుప్రాప్తించునో చెప్పుమని యాబ్రాహ్మణుని తిరిగి కర్కశుఁడడిగెను.

శంభురువాచ॥ శ్లో॥ శృణుకర్కశత త్ప్రాప్తి ర్యథాస్యాత్తద్వదామి తే॥ ౧౦౯॥ దారపుత్ర గృహాదీనాం ప్రీతింముక్త్వాజనార్దనం। దివారాత్రంచింతయిత్వా సర్వదేహస్య చాలకమ్॥ ౧౧౦॥ ఆత్మానం

బహుపుణ్యైస్త్రిమణీకృత్య మానసం । తత్స్వరూపే యదాతిష్ఠే త్సముక్తో నేతరోజనః॥ ౧౧౧॥

తా॥ శంభుఁడు చెప్పుచున్నాఁడు. ఓబోయవాఁడా! ఆమోక్షము ఎట్లు కలుగునో నీకు చెప్పెదను వినుము. భార్యాపుత్ర గృహాదుల యందు నపేక్షవదలి రాత్రింబవలును భగవంతుఁడగు శ్రీరామచంద్ర మూర్తిని ధ్యానింపుచు విశేషమగు పుణ్యకార్యములను జేయుచు సమస్తేంద్రియములను చలింపఁజేసి విఘ్నమును కలిగించునట్టి మనస్సు నితరవృత్తులకు బోనీయక నిర్మలముగా నుండునట్లుజేసి ఆత్మస్వరూప దృష్టియందు స్థిరముగా నెప్పుడుండునో వాఁడే మోక్షము నొందు వాఁడు కాని యితరుఁడు కాఁడు.

శ్లో॥ ఏవం వదతివిప్రేంద్రే వ్యాధోముక్త్వా శరంధనుః । శంభు పాదౌ జవాన్నత్వా త్రాహిత్రాహీ తివైవదన్॥ ౧౧౨॥ ప్రోవాచ ద్విజవర్యంస వ్యాధోమా ముద్ధరేతిచ॥

తా॥ ఇట్లు బ్రాహ్మణుఁడుచెప్పగా నాబోయవాఁడు ధనుర్బాణములను విడిచిపెట్టి ఆబ్రాహ్మణుని పాదములకు నమస్కరించి యో విప్రోత్తమా! నన్ను రక్షింపుము. సంసారమునుండి తొలగింపుము. అని పలికెను.

శ్లో॥ ఏతస్మిన్నంతరే తత్ర రాక్షసో ఘోరదర్శనః । దుద్రావ దీర్ఘనాశబ్దేన యత్రాసంస్తేత్రయోవనే॥ ౧౧౩॥

తా॥ ఇట్టి సమయములో భయంకరాకారముగల యొక రాక్షసుఁడు బ్రాహ్మణుఁడు భార్య బోయవాఁడు ఈముగ్గురునున్నట్టి యా యడవిలోనికి పెద్దకేకలు వేయుచు పరుగెత్తుకొని వచ్చెను.

శ్లో॥ ఆయాంతం రాక్షసందృష్ట్వా చక్రుస్తేతు పలాయనమ్॥ ౧౧౪॥ తావజ్జవేనతాన్ధర్తుం నికటం రాక్షసోయయౌ॥

తా॥ ఇట్లు వచ్చుచున్నట్టి యారాక్షసుని జూచి యాముగ్గురును పారిపోవుచుండగా వారిని పట్టుకొనుటకు మహావేగముగా వారివద్దకు వెళ్లెను.

బహుపుణ్యైస్తైర్నిమ్మలీకృత్య మానసం । తత్స్వరూపే యదాతిష్ఠేత్సముక్తో నేతరోజనః॥ ౧౧౧॥

తా॥ శంభుఁడు చెప్పుచున్నాఁడు. ఓబోయవాఁడా! ఆమోక్షము ఎట్లు కలుగునో నీకు చెప్పెదను వినుము. భార్యాపుత్ర గృహాదుల యందు నపేక్షవదలి రాత్రింబవలును భగవంతుఁడగు శ్రీరామచంద్ర మూర్తిని ధ్యానింపుచు విశేషమగు పుణ్యకార్యములను జేయుచు సమస్తేంద్రియములను చలింపఁజేసి విఘ్నమును కలిగించునట్టి మనస్సు నితరవృత్తులకు బోనీయక నిర్మలముగా నుండునట్లుజేసి ఆత్మస్వరూప దృష్టియందు స్థిరముగా నెప్పుడుండునో వాఁడే మోక్షము నొందు వాఁడు కాని యితరుఁడు కాఁడు.

శ్లో॥ ఏవం వదతివిప్రేంద్రే వ్యాధోముక్త్వా శరంధనుః । శంభుపాదౌ జవాన్నత్వా త్రాహిత్రాహీతివైవదన్॥ ౧౧౨॥ ప్రోవాచ ద్విజవర్యంస వ్యాధోమా ముద్ధరేతిచ॥

తా॥ ఇట్లు బ్రాహ్మణుఁడుచెప్పగా నాబోయవాఁడు ధనుర్బాణములను విడిచిపెట్టి ఆబ్రాహ్మణుని పాదములకు నమస్కరించి ఓయీ విప్రోత్తమా! నన్ను రక్షింపుము. సంసారమునుండి తొలగింపుము. అని పలికెను.

శ్లో॥ ఏతస్మిన్నంతరే తత్ర రాక్షసో ఘోరదర్శనః । దుద్రావ దీర్ఘశబ్దేన యత్రాసంస్తేత్రయోవనే॥ ౧౧౩॥

తా॥ ఇట్టి సమయములో భయంకరాకారముగల యొక రాక్షసుఁడు బ్రాహ్మణుఁడు భార్య బోయవాఁడు ఈముగ్గురునున్నట్టి యా యడవిలోనికి పెద్దకేకలు వేయుచు పరుగెత్తుకొని వచ్చెను.

శ్లో॥ ఆయాంతం రాక్షసందృష్ట్వా చక్రుస్తేతు పలాయనమ్ ॥ ౧౧౪॥ తావజ్జవేనతాన్ధర్తుం నికటం రాక్షసోయయౌ॥

తా॥ ఇట్లు వచ్చుచున్నట్టి యారాక్షసుని జూచి యాముగ్గురును పారిపోవుచుండగా వారిని పట్టుకొనుటకు మహావేగముగా వారివద్దకు వెళ్లెను.

శ్లో॥ తం దృష్ట్వా నికటంశంభుస్తుం బికాం సజలాం నిజాం। కృత్వాచ్ఛాం ప్రాక్షిపత్తస్మిన్ రామచంద్రం స్మరన్ముఖే॥ ౧౧౫॥

తా॥ ఆ బ్రాహ్మణుఁడు తమవద్దకు రాక్షసుఁడురాగా తప్పించుకొనలేక తన వద్దనుండెడి సొరకాయబుర్రలోని జలమును శ్రీరామమూర్తిని స్మరింపుచు నారాక్షసుని ముఖముమీఁద జల్లెను.

శ్లో॥ మంత్రితం రామనామ్నాచ యతోఽయం మధుమాసికై। తత్సేకాద్రాక్షస స్యాపి జాతాపూర్వ భవస్మృతిః॥ ౧౧౬॥ తతస్స రాక్షసోదూరం స్థిత్వాశంభుం వ్యజిజ్ఞపత్॥ ౧౧౭॥

తా॥ ఇట్లు చైత్రమాసములో రామనామమును దలఁచుచు జలమును మంత్రించి యాజలమును ఆరాక్షసుని మీఁదజల్లుటచే వారికి పూర్వజన్మ జ్ఞానముకలిగి దూరముగా నిలుచుండి ఆశంభుఁడను బ్రాహ్మణునితో నిట్లు విన్నవించుకొనెను.

శ్లో॥ మాముద్ధర మునిశ్రేష్ఠ ఘోరాద్రాక్ష సదేహతః। శరణంతే కరోమ్యద్య జాతాపూర్వ స్మృతిర్మమ॥ ౧౧౮॥

తా॥ ఓ మునీశ్వరుఁడా! నీకు నమస్కరించెదను. ఈ రాక్షస జన్మనుండి నన్ను విముక్తునిగాఁ జేయుము నాకు పూర్వజన్మ జ్ఞానము కలిగినది. అని రాక్షసుఁడు పలికెను.

శ్లో॥ ఇతి తత్కౌతుకందృష్ట్వా రాక్షసం ప్రాహసద్విజః। కస్మాత్తే రాక్షసత్వంహి జాతం తత్సం వదాధునా॥ ౧౧౯॥

తా॥ ఇట్లు మహాప్రార్థనతో నడిగిన యారాక్షసుని ఆ బ్రాహ్మణు డిట్ల యడుగుచున్నాఁడు. ఓ రాక్షసుఁడా! ఈ రాక్షస జన్మ నీకు యేలాగు సంభవించినదో జెప్పుమని తిరిగి బ్రాహ్మణుఁడడిగెను.

శ్లో॥ రాక్షసః ప్రాహ వేగేన శంభుంవృత్తం నిజంతదా॥

తా॥ తర్వాత ఆ బ్రాహ్మణునితో నారాక్షసుఁడు తన వృత్తాంతమునంతయు నిట్లుచెప్పుచున్నాఁడు.

శ్లో॥ జనస్థానే పురాచాహం విప్రః కర్మపరాఙ్ముఖః। ప్రతిగ్రహపరః పాపీ దుర్మార్గవ్యసనీ సదా॥ ౧౨౦॥

శ్లో॥ చిత్రగుప్తోపిమాం దృష్ట్వా ధిక్కృత్వాపి పునః పునః। యమరాజం తదా ప్రాహ ధర్షయన్మాం స్వగర్జితైః॥ ౧౨౭॥

తా॥ చిత్రగుప్తుఁడు నన్నుజూచి కోపించి మాటిమాటికి నిందించుచు మేఘగంభీరవాక్కులచే ఝళిపించుచు యమధర్మరాజుతో నిట్లు చెప్పెను.

శ్లో॥ భోధర్మరాజ పాపోయం చైత్రస్నాననివారకః । భుక్త్వాదా రాక్షసీంయోనిం నిరయాన్ భోక్తు మర్హతి॥ ౧౨౮॥

తా॥ ఓ ధర్మరాజా! ఇతఁడు తన భార్య చైత్రమాసములో సరయూనదియందు స్నానముఁజేయుటకు బోవుచుండఁగా వెళ్లనీయక నడ్డపెట్టెను. కాఁబట్టి ముందుగా రాక్షస జన్మయందు బుట్టి పిమ్మట నరకముల ననుభవింపఁజేయుటకు తగినవాఁడు.

శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా యమః ప్రాహానుగాం స్తదా । భోభటా రాక్షసీయోని దీయతాం నిజకాననే॥ ౧౨౯॥ పాపినేస్మై చమద్వాక్యా త్తతః తస్మై యమానుగైః । దత్వామే రాక్షసీంయోనిం త్యక్త్వాచాత్ర గతాయమమ్॥ ౧౨౦॥ తదారభ్య వనేచాహం క్షుత్తృషా పరిపీడితః । పంచత్రింశ త్సహస్రాణి వర్షాణ్యత్ర స్థితశ్చిరమ్॥

తా॥ ఇట్లు చిత్రగుప్తుఁడు చెప్పిన మాటలను విని యమధర్మరాజు తన భటులతో నిట్లు పలికెను. ఓ భటులారా! ఇతఁడు పాపాత్ముఁడు కాఁబట్టి జనరహితమగు నడవిలో నాయాజ్ఞప్రకారము రాక్షసజన్మలోఁబుట్టునట్లుజేయుఁడనిపలుకఁగా యమభటులునదేప్రకారము రాక్షసునిగాఁబుట్టునట్లుజేసి యమలోకమునకు దీసికొని వెళ్ళిరి. అదిమొదలు ఆకలిదప్పికలచే బాధపడుచు ముప్పదియైదువేలసంవత్సరముల నుండి యిక్కడనే బహుకాలము రాక్షసునిగా నుంటిని.

శ్లో॥ కిం మయా సుకృతం పూర్వం కృతం యస్మాద్వనేతవ । సంగతిశ్చాద్యవైజాతా సాధుసంగో గతిప్రదః॥ ౧౩౦॥

తా॥ పూర్వజన్మయందు నేమిపుణ్యము జేసికొంటినో ఈనిర్జనమగు నడవిలో మీవంటిపుణ్యాత్ముల దర్శనము కలిగినది. ఇప్పుడు సత్పురుషుల సహవాసము కలుగుట సుగతినిచ్చును. వ్యర్థముకాదు.

శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా శంభుర్ధ్యాత్వా క్షణంహృది।
జ్ఞాత్వా తత్సుకృతం పూర్వం రాక్షసాయ న్యవేదయత్॥ ౧౩౧॥

తా॥ ఇట్లుపలికిని రాక్షసుని మాటలనువిని యాబ్రాహ్మణుఁడు క్షణకాలము తన మనస్సులో యోగదృష్టిని రాక్షసుని యొక్క పూర్వ సుకృతమును దెలిసికొని వానితో నిట్లు చెప్ప ప్రారంభించెను.

శ్లో॥ శృణు రాక్షసయ త్పూర్వం కృతంవై సుకృతం త్వయా।
యస్మాజ్ఞాతా సంగతిర్మే వనేనిర్మానుషే శుభా॥ ౧౩౨॥

తా॥ ఓరాక్షసుఁడా! పూర్వము నీవేమి పుణ్యము జేసికొంటివో మనుష్యశూన్యమగు నీయడవియందు శ్రేయస్సునకు కారణమైన నాదర్శనమెందువల్ల కలిగినదో ఈవృత్తాంతమంతయుఁ జెప్పెదను సావధానముగా వినుము.

శ్లో॥ ఏకాదశ్యాం చైత్రశుక్లే భుక్త్వాన్య శ్రాద్ధభోజనం।
తాంబూలో దక్షిణాయుక్తః కట్యాంవస్త్రే త్వయాధృతః॥ ౧౩౩॥

తా॥ చైత్రశుద్ధ యేకాదశి రోజున నొకరి యింట శ్రాద్ధభోజనముఁజేయగా వారు దక్షిణసహితముగా తాంబూలమిచ్చిరి. దానిని బొడ్డున వస్త్రములో దాచియుంచితివి.

శ్లో॥ ద్వాదశ్యాం ప్రాతరుత్థాయ గత్వాస్నానంత్వయాకృతం।
పతితస్సహి తాంబూలో విస్మృత్యా గౌతమీతటే॥ ౧౩౪॥

తా॥ మరునాఁడు ద్వాదశిరోజున ప్రాతఃకాలమున లేచి స్నానముఁజేయుటకు గోదావరీనదికి వెళ్లగా నక్కడ జ్ఞాపకము లేకపోవుటచే దక్షిణా సహితముగా తాంబూలము అక్కడ జారిపడెను.

శ్లో॥ దక్షిణాసహితో దృష్ట స్సకేనాపి ద్విజేనవై। గృహీత స్సహిద్వాదశ్యాం నజ్ఞాతశ్చ త్వయాపునః॥ ౧౩౫॥

తా॥ దక్షిణతోఁగూడజారిపడిన తాంబూలమును ద్వాదశిరోజున నొక బ్రాహ్మణుఁడుజూచి తీసికొనెను. అదియేమియునీకు తెలియలేదు.

శ్లో॥ తాంబూలదానా ద్వరచైత్రమాసే జాతావనే మేద్యహి సంగతి స్తే। తస్మాన్మహా రాక్షసమానవైహి తాంబూలదానం కరణీయమేతత్॥ ౧౩౬॥

తా॥ ఓ రాక్షసుఁడా! చైత్రమాసములో తాంబూలదానము వల్ల నిచ్చుట నీవు నాదర్శనముఁజేయుట సంభవించినది. కాఁబట్టి చైత్రమాసములో తాంబూలదానము మొదలగునవి ముఖ్యముగాఁ జేయవలయును.

శ్లో॥ ఇత్యుక్త్వా రాక్షసంశంభు శ్చైత్రమాహాత్మ్యముత్తమం। ఉభాభ్యాం శ్రావయిత్వాథ కర్కశంవాక్యమబ్రవీత్॥ ౧౩౭॥

తా॥ ఇట్లు శంభుఁడు రాక్షసునితో వాని వృత్తాంతముఁజెప్పి తర్వాత రాక్షసునికి కర్కశునికి చైత్రమాస మహాత్మ్యముఁగూడ చెప్పి పిమ్మట కర్కశునితో నిట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ భోకర్కశ మహాబుద్ధే శ్రుణుష్వ వచనంమమ। ఆగచ్ఛ త్వం సహైవాత్ర మయాయోధ్యాపురీం ప్రతి॥ ౧౩౮॥

తా॥ సూక్ష్మబుద్ధిగల యో కర్కశుఁడా! నేను జెప్పునట్టి మాటనువినుము. నేను అయోధ్యాపట్టణమునకు వెళ్లుచున్నాను. నీవు కూడ నాతోరమ్ము.

శ్లో॥ సరయూస్నాన మాత్రేణ మధౌ పాపాద్విమోక్ష్యసే। ఇత్యుక్త్వా కర్కశంశంభు స్తతఃప్రోవాచ రాక్షసమ్॥ ౧౩౯॥

తా॥ చైత్రమాసములో సరయూనదియందు స్నానముఁజేసిన యెడల నీయొక్క సమస్తపాపములు నశించును. ఇట్లు కర్కశునితోఁ జెప్పి యాబ్రాహ్మణుఁడు పిమ్మట తిరిగి యిట్లు రాక్షసునితోఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ భోరాక్షసత్వమత్రైవ మాసమాత్రం స్థిరోభవ। అయోధ్యాయాం ప్రవేశశ్చ రాక్షసానాం నవిద్యతే॥ ౧౪౦॥ అతోహం మధుమాసేహి స్నాత్వానేన పథాపునః। యదా గచ్ఛామికాంచీం త్వాం చోద్ధరిష్యామ్యహం తదా॥ ౧౪౧॥

తా॥ ఓ రాక్షసుఁడా! ఒకమాసము వఱకు నీవు యిక్కడనే యుండుము. ఎందువల్లననఁగా రాక్షసులు అయోధ్యాపట్టణమునకు వచ్చుటకు వీలులేదు. కాఁబట్టి చైత్రమాసములో సరయూనదియందు

స్నానముఁజేసి తిరిగి యీమార్గముగానే కాంచీపట్టణమునకు వెళ్లెదను. అప్పుడు నీపాపవిమోచనమునుజేసి వెళ్లెదను.

శ్లో॥ మానందేహోస్తు తేచిత్తే శపథేన బ్రవీమ్యహం । యత్పాపం బ్రహ్మహత్యాయా స్తథాగోయతినిందనాత్ ॥ ౧౪౨॥ నోద్ధృత్యత్వాంహి గచ్ఛామి తర్హితన్మయితిష్ఠతు॥ ౧౪౩॥

తా॥ ఓ రాక్షసుఁడా నీమనస్సులో సందేహముంచుకొనవద్దు. నేను ప్రమాణపూర్వకముగాఁజెప్పుచున్నానువినుము. నిన్నుపాపవిముక్తునిగాఁజేయక నేను వెళ్లితినేని బ్రహ్మహత్యఁజేసినట్టి పాపము, గోవులను,యతీశ్వరులను నిందించుటవల్లకలిగిన పాపమును నేనుపొందెదను.

శ్లో॥ మద్యపానేన యత్పాపం హేమస్తేయాదికంచయత్ । నోద్ధృత్యత్వాంహి గచ్ఛామి తర్హితన్మయితిష్ఠతు॥ ౧౪౪॥ యత్పాపం భ్రూణహత్యాయా స్తథాచైత్రేహ్యమజ్జనాత్ । నోద్ధృత్యత్వాంహి గచ్ఛామి తర్హితన్మయితిష్ఠతు॥ ౧౪౫॥

తా॥ కల్లు త్రాగుటచేతను బంగారము దొంగిలించుటచేతను, గర్భమును పోగొట్టుకొనుటచేతను, ఏ పాపముసంభవించునో నీపాపవిమోచనముఁ జేయక వెళ్లితినేని ఆపాపమును జెందెదను.

శ్లో॥ ఇత్యాది శపథై స్తర్హి రాక్షసం హర్షయర్ద్విజః । యావత్పశ్యామి సర్వత్ర తావజ్జాతంహి కౌతుకమ్॥ ౧౪౬॥ వ్యాధాయ చైత్రమాసస్య మహాత్మ్యస్యోపదేశతః॥

తా॥ ఈ మొదలగు ప్రమాణములను జేయుటచే రాక్షసుఁడు నమ్మి సంతోషించెను. అప్పుడా బ్రాహ్మణు డిట్లు తలచెను. చైత్రమాసమాహాత్మ్యమును కిరాతునకుపదేశముఁజేయుటవల్ల వాడొక్కఁడే సంతోషించలేదు. నేను జూచినంతపర్యంతము పశుపక్ష్యాది సహితమగు నీయడవియంతయు సంతోషించినట్లు కనుపించుచున్నది. అది యెట్లనఁగా.

శ్లో॥ తరవఃఫలినోజాతాః పరితోదశయోజనం । పత్రైఃపుష్పైర్వినమాశ్చ సౌగంధః పవనోవహో॥ ౧౪౭॥ నద్యస్తో యవహంత్యశ్చ నన్నృతు బర్హిణోవనే॥ ౧౪౮॥

తా॥ ఆకులు పువ్వులు కాయలు మొదలగు వానిండియుండి వంగియున్న కొమ్మలతోఁ గూడుకొనుటచే వృక్షములు భూమి మీఁద వఱకు వ్రాలి పదియామడ పర్యంతము నిట్లు కనుపించుచున్నవి. మఱియు పరిమళముగల వాయువు వీచుచున్నది. నదులు జలముతో నిండి ప్రవహించుచున్నవి. నెమళ్లు నాట్యమాడుచున్నవి.

శ్లో॥ తద్దృష్ట్వా కర్కశశ్చాపి చైత్రమాహాత్మ్యకీర్తనాత్ ।
దుర్వనం సువనం జాతం చైత్రశ్రైష్ఠ్య మమన్యత॥ ౧౪౯॥

తా॥ ఇట్లు పూర్వము ఫలపుష్పాది రహితమై యెండిపోయి చూడ నసహ్యముగా నున్నట్టి యాయడవి ఫలపుష్ప ఫలాదులతోఁ గూడి చూచుటకు నానందముగా నుండుటచే చైత్రమాస మహాత్మ్యము విసుటవల్ల కలిగినదని యాకర్కశుఁడును తలచెను.

శ్లో॥ తత స్సేహ త్రియ స్తస్మా న్వనాన్మార్గేణ నిర్గతాః ।
శనైశ్శనై రయోధ్యాయాః పథిపశ్యన్ వనస్థలీమ్॥ ౧౫౦॥

తా॥ పిమ్మట నాముగ్గురు అక్కడనుండి బయలుదేరి అయోధ్యాపట్టణమునకు నెమ్మది నెమ్మదిగాఁ బోవుచు మార్గములో నుండెడి యడవులనుజూచుచు వెళ్లుచుండిరి.

శ్లో॥ తావచ్ఛబ్దో మహాన్ జాత స్సింహమాతంగ సంభవః ।
ధావన్నగ్రేతు మాతంగః పృష్ఠేధావంశ్చ కేసరీ॥ ౧౫౧॥ ఏవంతౌ శంభు సాన్నిధ్యం ప్రాప్తౌ కలహకారిణౌ । మార్గరోధ కరౌ దృష్ట్వా తౌదుష్టౌ శంభురబ్రవీత్॥ ౧౫౨॥

తా॥ ఇంతలో సింహధ్వనియు నేనుఁగధ్వనియు వినపడెను. ఏనుగ ముందరను వెనుకను ఏనుగయు నడచుచు నొకటితో నొకటి పోట్లాడుకొనుచు మార్గములో వెళ్లుచుండెడి శంభునకు నడ్డము వచ్చినవి. అప్పుడు వాటిని రెంటిని జూచి యిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ పశ్యకర్కశ విఘ్నాని చైత్రస్నాన పదేపదే । సంభవంతీతివై బుధ్వా చైత్రస్నానం నలంఘయేత్॥ ౧౫౩॥

తా॥ ఓ కర్కశుఁడా! చూచితివా! చైత్రమాస స్నానముఁ

జేయవలయుననుకుంటే మాటిమాటికి విఘ్నములు కలుగుచున్నవి. ఇట్లు తెలిసియున్నను చైత్రస్నానమును విడిచిపెట్ట శక్యముకాదు.

శ్లో॥ కాశ్యాంవివాహే గీతాయాం గంగాయాం రామచింతనే। చైత్రస్నానే మహాదానే విఘ్నాని సంభవంతిహి॥ ౧౫౪॥

తా॥ కాశికి వెళ్లవలెననుకున్నను, వివాహముఁ జేయవలయు ననుకున్నను, భగవద్గీతలను చదువవలెననుకున్నను, గంగానదిలో స్నానముఁ జేయవలయుననుకున్నను, శ్రీరామమూర్తిని ధ్యానించ వలెననుకున్నను, చైత్రమాసములో స్నానముఁ జేయవలెననుకున్నను, గొప్ప దానములను జేయవలెననుకున్నను విఘ్నములు కలుగు చున్నవి.

శ్లో॥ ఏవం వదతి విప్రేంద్రే తౌదుష్టౌ కరికోహలౌ। చైత్రి రామ శ్రీవాత్పూర్వ జన్మస్మృత్యాతి విస్మితౌ॥ ౧౫౫॥ భూత్వా వై తాహి తాహీతి కృత్వా దీర్ఘతరం మహారవం। శరణం ద్విజ వర్యాయ జగతుః శంభుశర్మణే॥ ౧౫౬॥

తా॥ ఇట్లు బ్రాహ్మణుడు చెప్పుచుండగా నాసింహము ఏను గయు చైత్రమాస స్నానముఁ విషయమును గుఱించియు రామధ్యాన మును గుఱించియు కొంత ప్రశంసను వినగానే పూర్వజన్మజ్ఞానము కలిగి అత్యాశ్చర్యమునొంది యోస్వామి మమ్ములను రక్షింపుము రక్షింపు మనుచు పెద్దమొఱబెట్టుచు శంభుఁడను పేరుగల యాబ్రా హ్మణుని శరణను పొందినవి.

శ్లో॥ సోపిశంభుశ్చ తాభ్యాంహి పృష్టవాన్ తత్కృపాన్వితః। కిమర్థం దుష్టజాతిహీ ప్రాప్తా తత్కథ్యతాంమమ॥ ౧౫౭॥

తా॥ ఆ శంభుఁడును ఆ యేనుగ సింహములయందు దయగల వాఁడై యెందునిమిత్తమిటువంటి క్రూరజన్మ కలిగినదో చెప్పుమని యాజంతువుల నడిగెను.

శ్లో॥ ఇతి విప్రవచః శ్రుత్వా కేసరీవాక్య మబ్రవీత్। సేతౌ రామేశ్వరక్షేత్రే పూర్వజన్మ న్యహంద్విజః॥ ౧౫౮॥ నిందకస్సర్వ ధర్మాణాం పాషండో హ్యేక తత్పరః॥ ౧౫౯॥

తా॥ ఇట్లు చెప్పిన బ్రాహ్మణుని మాటలను విని సింహమిట్లు చెప్పుచున్నది. ఓ బ్రాహ్మణోత్తమా! పూర్వజన్మలో సేతువువద్ద నుండెడి రామేశ్వరములో నొక బ్రాహ్మణునిగాను పాషండమార్గము నవలంబించి సమస్త ధర్మములను నిందించునట్టి వాఁడనుగాను బుట్టితిని.

శ్లో॥ కదాచి చ్చైత్రమాసేతు తత్ర శ్రీరామసంజ్ఞికే । తీర్థేజనసమూహేతు శ్రుత్వా పౌరాణికీం కథామ్॥ ౧౬౦॥ పౌరాణికేన కథితాం చైత్రమాహాత్మ్య సూచికాం । కృతవా న్నిందనంచాహం వారంవారం పునఃపునః॥ ౧౬౧॥

తా॥ తర్వాత కొంతకాలము జరిగిన పిమ్మట చైత్రమాస మాహాత్మ్య సంబంధమగు పురాణమును రామతీర్థ క్షేత్రమందు నొక పౌరాణికుఁడు కొంతమందికిఁ జెప్పుచుండగా నేను విని మాటి మాటికి వారిని ఆ పురాణమును నిందించుచుంటిని.

శ్లో॥ తన్మత్కృతం నిందనంచ కశ్చిద్విప్ర స్తపస్థితః । శుశ్రావ సకలందుష్టం తేనశప్తో స్మ్యహంతదా॥ ౧౬౨॥

తా॥ ఇట్లు నేజేసిన నిందను విని ఒక బ్రాహ్మణుఁడు తపస్సునందుండి నాదుష్టప్రవర్తనను కూడ జూచి నన్నీవిధముగా శపించెను.

శ్లో॥ క్రూరాం జాతిం త్వరంగచ్ఛ యదాచైత్రేశ కీర్తనం । భవిష్యతి మహారణ్యే శాపశాంతి స్తదేతిచ॥ ౧౬౩॥

తా॥ నీకు క్రూరజాతియందు పుట్టుకగలుగును. ఈ మహారణ్యములోనుండగా చైత్రమాసములో శ్రీరామధ్యానము సంభవించి నప్పుడు నీకు శాపనివృత్తియగును.

శ్లో॥ ఏవంప్రోక్తం మయాసర్వం పూర్వజన్మ నియత్కృతం । తేనశాపేన జాతోస్మి కేసరీ భయకారకః॥ ౧౬౪॥

తా॥ ఇట్లు పూర్వజన్మయందు నేను జేసిన ప్రవర్తననంతయుఁ జెప్పితిని. అట్లు ఆ బ్రాహ్మణుఁడిచ్చిన శాపముచే సమస్త జంతువులకు భయమును కలిగించు సింహముగా బుట్టితిని.

శ్లో॥ చైత్రరామ శ్రవాజ్ఞాతా పూర్వస్మృతి రనుత్తమా।
ఇదానీం రక్షమాంవిప్ర త్వంచైత్రేసింహదేహతః॥ ౧౬౪॥

తా॥ చైత్రమాసములో రామనామమును వినుటచే శ్రేష్ఠమగు పూర్వజన్మజ్ఞానము సంభవించినది. కాఁబట్టి యో బ్రాహ్మణుఁడా! యీ సింహదేహము నాకు విముక్తియగునట్లుగా నిప్పుడు తప్పక జేయుమని సింహముఁజెప్పెను.

శ్లో॥ ఇతిసింహస్య వృత్తంతు జ్ఞాత్వోవాచ గజంద్విజః॥

తా॥ ఇట్లు సింహముయొక్క వృత్తాంతము నెఱింగి పిమ్మట యేనుగు నడుగుచున్నాఁడు.

శ్లో॥ కస్మాచ్చ మాతంగగతోసి దుష్టజాతౌ వదస్వాద్య మహాఘసంఘాత్ । సచాపి మాతంగ వర స్సమస్తం వృత్తంనిజంచా కథయచ్చ జీర్ణమ్॥ ౧౬౬॥

తా॥ ఓ యేనుగా। పూర్వజన్మయందు నీ వేమి పాపముఁ జేయుటచే నిట్టి యేనుగ జన్మ కలిగినదో జెప్పుమని యా బ్రాహ్మణుఁ డడుగ నా యేనుఁగయు పూర్వము తాను జేసినయావత్తువృత్తాంతమును సవిస్తరముగా నిట్లుఁజెప్ప నుపక్రమించెను.

మాతంగఉవాచ॥ శ్లో॥ శృణువిప్ర ప్రవక్ష్యామి పూర్వవృత్తం మయాకృతం। రామనాథ పురేచాహం కావేర్యా ఉత్తరేతటే॥ ౧౬౭॥ విప్రః పరమదుర్వృత్త స్సర్వశాస్త్ర పరాఙ్ముఖః । లక్ష్మీమ్రభర మదాక్రాంతః పణ్యాస్త్రీభోగ తత్పరః॥ ౧౬౮॥

తా॥ ఏనుఁగ తన వృత్తాంతమును జెప్పుచున్నది. ఓ బ్రాహ్మణోత్తమా! పూర్వజన్మమునందు నేజేసిన వృత్తాంతమును జెప్పెదను వినుము. కావేరీనదియొక్క యుత్తరతీరమందు రామనాథమను పట్టణము కలదు. ఆ పట్టణములో నొక బ్రాహ్మణునికి కుమారునిగా జనియించినవాఁడను. సమస్త శాస్త్రములను విడిచిపెట్టి ధనముకలిగి యుండు మదముచే వేశ్యాస్త్రీల సంభోగము మొదలగు దుష్కార్యములను జేయుచు దుర్మార్గముగా తిరుగుచుంటిని.

శ్లో॥ ఏకదాసు హృదాచాహం భోజనార్థకం నిమంత్రితః ।
శ్రాద్ధాహే మధుమాసేహి శుక్లే శ్రీనవమీ దినే॥ ౧౯॥ మయా భుక్తం సుహృద్గేహే నవమ్యాం ద్విజసత్తమ । తేనపాపేన జాతోస్మి కరిజాతౌ నసంశయః॥ ౧౨౦॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! ఒకప్పుడు చైత్రశుద్ధనవమియగు శ్రీరామనవమీ దినంబున నాస్నేహితుని గృహంబున ఆబ్దికము వచ్చుటచే నన్నుభోక్తనుబిలచెను. అందుకు నేనంగీకరించి యాదినంబున శ్రాద్ధభోజనముఁ జేసితిని. ఆ పాపవిశేషముచే నేను ఏనుగజాతి యందు జన్మించితిని. ఈ విషయమై యేమియు సంశయములేదు.

శ్లో॥ సర్వదా ప్రతిమాసేహిం నవమ్యాం నహి భోజనం ।
కార్యం విశేషతో రామ నవమ్యాం నిందితంచతత్॥ ౧౨౧॥

తా॥ మఱియు ప్రతిమాసమందు నవమీదినంబున భోజనము చేయుటయే గూడదు అందులో శ్రీరామనవమియందు భుజియించుట మిక్కిలి నిషేధము.

శ్లో॥ ఇదానీం నహిజానామి కేనపుణ్యేన తేత్రవై । సంగతిశ్చ వనేజాతా సర్వేషాం పరమార్థిహృత్॥ ౧౨౨॥

తా॥ ఇప్పుడే పుణ్యవిశేషముచే నందరికిని సంతోషకరమగు మీబోటి పుణ్యాత్ములయొక్క సహవాసము ఈయడవియందు కలిగినదో నాకుఁదెలియదు. అని యాయేనుఁగ పలికెను.

శ్లో॥ ఇతి తస్య వచశ్శ్రుత్వా శంభుర్ధ్యానే విచారయత్ ।
జ్ఞాత్వా మాతంగ పుణ్యంతు ప్రోవాచకరిణం ద్విజః॥ ౧౨౩॥

తా॥ ఇట్లు చెప్పిన యేనుఁగుయొక్క మాటలనువిని యాబ్రాహ్మణుఁడు జ్ఞానదృష్టిని యేనుగయొక్క పుణ్యమును విచారించి యిట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ శృణుమాతంగ వక్ష్యామి యత్పుణ్యంచ త్వయాకృతం।
పూర్వజన్మ నితత్సర్వం యేనమేసం గతిర్వనే॥ ౧౨౪॥ జాతాత్వా ముద్ధరిష్యామి మాచింతాం కురు సర్వథా॥ ౧౨౫॥

తా॥ ఓ యేనుగా! నీవు పూర్వజన్మమందేమి పుణ్యమును జేసితివో. ఏకారణముచే నీయడవియందు నాతోడుక్క సాంగత్యము కలిగినదో, దానినంతయుఁ జెప్పెదను వినుము. సమస్త ప్రయత్నములచేతను యీ పశుజాతివల్ల ముక్తినొందించెదను.

శ్లో॥ రామనాథ పురేరమ్యే కావేరీతట శోభితే। రామాయణ కథాచైత్రే శ్రుతా శ్రీనవమీదినే॥ ౧౭౬॥ రామతీర్థే త్వయా స్నానం దృష్ట్వా రామేశ్వరే శివః। తేనపుణ్యేన తేజాతా సంగతిర్మమ కానన్॥ ౧౭౭॥

తా॥ కావేరీతీరమందుండెడి రామనాథ పట్టణమందు రామతీర్థముకలదు. చైత్రశ్రీరామనవమీ తిథిరోజున యాతీర్థములో స్నానముఁ జేసి యచ్చట రామేశ్వరమును శివుని దర్శించి రామాయణ కథను వింటివి. ఇట్లు చైత్రమాసములో సత్కాలక్షేపణమును జేయుటచే నీయడవిలో నాతోసాంగత్యము కలిగినది.

శ్లో॥ ఇదానీం శృణు సింహత్వం శృణోతుచ కరీమహాన్। సాకేతే మధుమాసేహి స్నాత్వా తేన పథాపునః। యదాగచ్ఛామి తాంకాంచీం యువాముద్ధరయామ్యహమ్॥ ౧౭౮॥

తా॥ ఓ సింహమా! ఓ యేనుగా! మీయుభయులతో నేజెప్పునదేమనఁగా. చైత్రమాసములో అయోధ్యాపట్టణమందు గల రామతీర్థములో స్నానముఁజేసి యీ మార్గముగానే తిరిగి కాంచీపట్టణమునకుఁ బోగెదను. అప్పుడు మీపాపవిమోచనముఁ జేసెదను.

శ్లో॥ మాసందేహోత్ర కర్తవ్య శ్శపథైః ప్రబ్రవీమ్యహాం। సంతోషార్థం యువాభ్యాంహి ప్రోచ్యంతే శపథామయా॥ ౧౭౯॥

తా॥ ఈ విషయమై మీ రెంతమాత్రము సందేహించవద్దు. మీకు నమ్మకము కలుగుటకుగాను సంతోషము నొందుటకును నేను ప్రమాణములనుజేసి చెప్పుచున్నాను వినుఁడు.

శ్లో॥ పరస్త్రీ గమనాత్పాపం తథా మిత్ర వధాదికాత్। యువాంనోద్ధృత్య గచ్ఛామి తర్హితన్మయి తిష్ఠతు॥ ౧౮౦॥ బ్రహ్మ

స్వహరణా త్పాపం యత్స్మృతం మాతృ నిందనాత్ । యువాంనో ద్ధృత్య గచ్ఛామి తర్హితన్మయి తిష్ఠతు॥ ౧౮౧॥

తా॥ పరస్త్రీ గమనము, స్నేహితుని నమ్మించి చంపుట, బ్రాహ్మణుల ధన మపహరించుట, తల్లి దండ్రుల నిందించుట మొదలగు వానివల్లనే పాపము కలుగునో, మిమ్ములను శాపవిమోచనముం జేయక నేను వెళ్ళితినేని ఆపాపము నొందగలను.

శ్లో॥ ఇత్యుక్త్వా ద్విజవర్యస్స స్త్రియాభిల్లేన సంయుతః । కరిసింహా వనేస్థాప్య గచ్ఛన్మార్గే శనైశ్శనైః॥ ౧౮౨॥ దదర్శాన్య పథాయాంతం శీఘ్రం కార్పటికోత్తమం । వహంతం రామలింగార్థం శీఘ్రం భాగీరథీజలమ్॥ ౧౮౩॥ శంభుః పప్రచ్ఛతం నత్వా నమ్రః కార్పటికోత్తమం । కుతస్సమాగతంవిప్ర గమ్యతే క్వాధునావద॥

తా॥ ఇట్లు ఆశంభుఁడు ప్రమాణపూర్వకముగాఁ జెప్పి తన భార్యతోను బోయవానితోను గూడి యీగజసింహముల నీయడవియందేయుంచి మెల్లమెల్లగా వెళ్లుచుండగా రామలింగస్వామికి నభిషేకముఁ జేయునిమిత్తము పుణ్యప్రదమైన గంగాజలమును మోసికొని మఱియొక మార్గముగా వచ్చుచున్న యొక బ్రాహ్మణుని జూచి శంభుఁడు వినయవిధేయతగలవాఁడై యాతనికి నమస్కరించి యో బ్రాహ్మణోత్తమా! యెక్కడనుండి వచ్చుచుంటివి యెక్కడకు బోయెదవు. ఈసంగతి జెప్పుమని శంభుఁడా బ్రాహ్మణునడిగెను.

కార్పటిక ఉవాచ॥ శ్లో॥ ప్రయాగా దాగతంవిద్ధి మాంత్వం భూసురసత్తమ । మధుమాసేవగాహార్థ మయోధ్యాం ప్రతిగమ్యతే॥ ౧౮౪॥ ఇదానీంత్వం నిజంవృత్తం వదబ్రాహ్మణ సత్తమ । కుతస్సమాగతంచాత్ర గమ్యతేక్వాధునా వద॥ ౧౮౫॥

తా॥ తీర్థమును మోసికొనివెళ్లునట్టి బ్రాహ్మణుఁడు చెప్పుచున్నాఁడు. ఓ బ్రాహ్మణోత్తమా! నేను ప్రయాగవెళ్లి చైత్రమాసములో నయోధ్యయందు గల రామతీర్థములో స్నానముఁ జేయుటకు వెళ్లుచున్నాను. నావృత్తాంతమిది. నీవు యెక్కడనుండి వచ్చుచుంటివో యెక్కడకుబోయెదవో నీ నిజమైన వృత్తాంతమును

జెప్పుమని యాకార్పటికుఁడడిగెను. కార్పటికుడనఁగా జలమును మోసికొని వెళ్లువాఁడు.

శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా శంభుః ప్రోవాచతం తదా । శివకాంచ్యా స్సమాయాత మయోధ్యాం ప్రతిగమ్యతే । చైత్రమాసే వగాహార్థఁ సర్వంతే కథితంమయా॥ ౧౮౨॥

తా॥ ఇట్లు కార్పటికుఁడడుగఁగావిని శివకంచినుండి చైత్రమాసములో నయోధ్యయందుండెడి రామతీర్థఁములో స్నానముఁజేయుటకు వెళ్లుచున్నానని తన వృత్తాంతమునంతయు శంభుఁడు కార్పటికునితోఁ జెప్పెను.

శ్లో॥ ఇతి శంభువచశ్శ్రుత్వా పునఃకార్పటికోత్తమః । పప్రచ్ఛ ద్విజవర్యాయ కౌతుకావిష్టమానసః॥ ౧౮౮॥ శివకాంచ్యాం శంభునామా కశ్చిద్విప్రోస్తిభోద్విజ । తత్తస్య వచనంశ్రుత్వా పునశ్శంభుస్తమబ్రవీత్॥ ౧౮౯॥

తా॥ ఇట్లు చెప్పిన శంభునిమాటలను విని కార్పటికుఁడు సంతోషచిత్తముకలవాఁడై ఓబ్రాహ్మణోత్తమా శివకంచిలో శంభుఁడను నొకబ్రాహ్మణుఁడు కలడు ఆయన కుశలముగానుండెనా యని కార్పటికుఁడడుగఁగా విని తిరిగి శంభుఁడు కార్పటికునితో నిట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ బహవశ్శంభునామానో వర్తంతెద్విజతత్రహి । కస్త్వయా పృచ్ఛ్యతేతస్య వదగోత్రోపనామనీ॥ ౧౯౦॥ ఇతి విప్రవచశ్శ్రుత్వా పునఃకార్పటికోబ్రవీత్॥ ౧౯౧॥

తా॥ ఓ బ్రాహ్మణుఁడా ఆ పట్టణములో శంభుఁడను పేరుగలవారు చాలామందికలరు. కాఁబట్టి నీవు ఎవరినిగుఱించి యడిగితివో వానికి మఱియొక పేరుండిన యెడల అట్టిపేరును వానిగోత్రము తండ్రిపేరు మొదలగునవి చెప్పుమని శంభుఁడు చెప్పఁగా విని తిరిగి కార్పటికుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ భారద్వాజకులోత్పన్నం చక్రిగోప్యుపనామకం । మహాదేవ సుతంసర్వ వేదశాస్త్ర విశారదమ్॥ ౧౯౨॥ బ్రాహ్మణం శంభునామానం జానీషేత్వం నవావద॥

తా॥ భారద్వాజ గోత్రముకలవాఁడును మహాదేవునియొక్క కుమారుఁడును చక్రిగోపుఁడను రెండవపేరుగల శంభుఁడను యొక బ్రాహ్మణుఁడుకలడు. వానిని నీవెరుగుదువా లేదా యని కార్పటికుఁ డడిగెను.

శ్లో॥ ఏవంమహాకార్పటికేన సర్వంగోత్రోపనామాదిక మాదరేణ । ప్రోక్తం యథావచ్ఛ్రసభూసురోపి జ్ఞాత్వానిజం వృత్తమథావదత్తమ్॥ ౧౯౩॥

తా॥ ఇట్లు కార్పటికుఁడు తనగోత్రము తండ్రిపేరు మారుపేరు మొదలగునవి చెప్పఁగా విని తన వృత్తాంతమును యథార్థముగాఁ జెప్పుటచే తనను గుఱించియే యని గ్రహించి యాబ్రాహ్మణుఁడు కార్పటికునితో నిట్లు పలుకుచున్నాఁడు.

శ్లో॥ భోభోకార్పటికశ్రేష్ఠ కిమర్థంత్వంహిపృచ్ఛసి । తద్వదస్వసవిస్తారం మాశంకాంకురుచాత్రహి॥ ౧౯౪॥

తా॥ ఓ కార్పటికుఁడా! ఆశంభుని గుఱించి నీవేమి కారణముచే నడిగితివో ఆవృత్తాంతమునంతయుఁ జెప్పుము ఇందు విషయమై నీవెంతమాత్రము సందేహించవద్దు. అని తిరిగి శంభుఁడడిగెను.

కార్పటిక ఉవాచ॥ శ్లో॥ శ్రుణువిప్ర ప్రవక్ష్యామి యదర్థం పృచ్ఛ్యతే మయా । యదాహం గతవాన్గంగా సాగరం ద్రష్టుమాదరాత్ ॥ ౧౯౫॥ సీతాకుండసమీపేహి దేశేకీకటనామకే । దృష్టోహం మార్గమధ్యేచ పిశాచేనోగ్రరూపిణా॥ ౧౯౬॥

తా॥ కార్పటికుఁడు చెప్పుచున్నాఁడు. ఓ బ్రాహ్మణుఁడా! నేనడుగుటకు కారణమును చెప్పుచున్నాను వినుము. కీకటదేశములో సీతాగుండక్షేత్రము కలదు. అచ్చట గంగాసాగరసంగమముండెను. కాఁబట్టి దానిని జూచుటకు వెళ్లుచుండగా మార్గములో భయంకరమగు పిశాచ మొకటి కనుపించెను.

శ్లో॥ మాంహంతుం నికటంప్రాప్తం తందృష్ట్వాహంతదాద్విజ । శ్రీరామకీర్తనం దీర్ఘం కృతవాన్ భయకంపితః॥ ౧౯౭॥

తా॥ ఆ పిశాచము నన్ను చంపుటకు దగ్గిరకు వచ్చుచుండగాఁ జూచి భయపడినవాఁడనై విశేషముగా శ్రీరామధ్యానమును జేసితిని.

శ్లో॥ కీర్తనాద్రామ చంద్రస్య సపిశాచః పలాయనం । మత్తః కృత్వా సుదూరదేశే స్థిత్వా శుశ్రావకీర్తనమ్॥ ౧౯౮॥

తా॥ ఇట్లు నేజేసిన శ్రీరామచంద్రునియొక్క ధ్యానముచే ఆ పిశాచము పారిపోయి దూరముగానుండి నేజేసిన శ్రీరామస్మరణను వినుచుండెను.

శ్లో॥ తస్మాజ్జాతా పూర్వజన్మ స్మృతిస్తస్య శుభావహా । త్రాహిత్రాహీతి మాంప్రాహ మయూపృష్టస్సవైపునః॥ ౧౯౯॥

తా॥ ఇట్లు భగవన్నామమును వినుటచే ఆ పిశాచమునకు పూర్వజన్మ జ్ఞానముకలిగి ఓ స్వామీ రక్షింపుము రక్షింపుమని నన్ను ప్రార్థింపగా తిరిగి యాపిశాచము నిట్లు అడిగితిని.

శ్లో॥ కస్మాత్పిశాచ దేహత్వం జాతస్తద్వద సత్వరం । ఇతిమే వచనంశ్రుత్వా పిశాచః ప్రాహమాంపునః॥ ౨౦౦॥

తా॥ నీకు పిశాచస్వరూపము వచ్చుటకు కారణము చెప్పుమని నేనడుగఁగా ఆ పిశాచమిట్లు చెప్పెను.

శ్లో॥ కాంచీపుర్యాం ద్విజశ్చాహం ధుండినామాపురా స్థితః । నాన్నదానం మయాపూర్వం కృతంస్వల్ప మపిక్వచిత్॥ ౨౦౧॥

తా॥ పూర్వము కాంచీపట్టణమునందు ధుండియనుబ్రాహ్మణునిగా జన్మించితిని. కొంచమైనను అన్నదానమును జేసినవాఁడనుకాను.

శ్లో॥ తస్మాత్పిశాచ దేహత్వం ప్రాప్తం కార్పటికోత్తమ । ఇతి తస్యవచశ్శ్రుత్వా పునఃప్రోక్తస్సవైమయా॥ ౨౦౨॥

తా॥ అందువల్ల నాకు పిశాచజన్మ సంభవించినదని చెప్పఁగా నాపిశాచము మాటలను విని తిరిగి యాపిశాచము నిట్లు అడిగితిని.

శ్లో॥ కథం పిశాచయోన్యాస్తు తేముక్తిశ్చ భవిష్యతి । తతః పునస్సమాంప్రాహ యదిమేతనయశ్శుచిః॥ ౨౦౩॥ చైత్రేదర్శేమమోద్దేశా దన్నదానంకరిష్యతి । భవిష్యతిమమోద్ధార స్తత్క్షణాన్నాత్ర సంశయః॥ ౨౦౪॥

తా॥ ఓ పిశాచమా! ఈపిశాచజన్మనుండి నీ కేవిధముగా ముక్తి కలుగునో చెప్పుమని యడుగఁగా నా కుమారుఁడు పరిశుభ్రాంతఃకరణ గలవాఁడై చైత్రబహుళ అమావాస్య రోజున నన్ను గుఱించి యన్న దానమును జేసిన యెడల శీఘ్రముగానే యీ పిశాచజన్మమునుండి విముక్తి నొందెదను. ఇందు విషయమై సందేహము ఎంతమాత్రము లేదని పలికెను.

శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా పునఃప్రోక్త స్స్వయమయా। వర్తతేక్వసుత స్తేహి కింనామావదమాంప్రతి॥ ౨౦౪॥

తా॥ ఇట్లు పిశాచము చెప్పఁగా విని నీ కుమారుఁడు యెవరు ఆతని పేరేమి ఆతఁడెక్కడున్నాఁడు. ఇది యంతయుఁజెప్పుమని నేను ఆ పిశాచమును తిరిగి యడిగితిని.

శ్లో॥ తత స్తేన యథా ప్రోక్తం భారద్వాజాద్య చిహ్నజా। తతోప్రోక్తంచ మయాసర్వం నికటేతవభోద్విజ॥ ౨౦౬॥

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! నీ వద్ద నేను యేప్రకారముగా భారద్వాజ గోత్రము మొదలగునవి సర్వము ఏవిధముగాఁ జెప్పితినో ఆవిధముగానే ఆపిశాచము నాతోఁజెప్పినది.

శ్లో॥ పిశాచంహి పునశ్చాహ ముక్త్వాన్ తద్వాచా మ్యహం। రామేశార్ధఁంభో పిశాచ నీయతే జాహ్నవీజలమ్॥ ౨౦౭॥ మయా కరండమధ్యేహి యదాగచ్ఛామి దక్షిణాం। దిశంకాలేన కాంచీంహి ప్రవేక్ష్యామి యదా తదా॥ ౨౦౮॥ తనపుత్రాయ వృత్తంహి కథ యిష్యామ్యహం తవ। ఇతి మద్వచనం శ్రుత్వా సంతోషం పరమం గతః॥ ౨౦౯॥

తా॥ అప్పుడు పిశాచముతో నేను జెప్పిన దేమనఁగా. ఓపిశా చమా నేను రామేశ్వరమునకు రామలింగస్వామికి నభిషేకముఁ జేయుటకు గాను ఈ కలశములో గంగాజలము నుంచుకుని తీసికొని వెళ్లుచున్నాను. కాఁబట్టి కొంతకాలమయిన పిమ్మట దక్షిణదిక్కునకు వచ్చుచు కాంచీపట్టణమునకు వెళ్ళినప్పుడు నీవృత్తాంతమును నీవు

చెప్పిన వృత్తాంతమునంతయుఁ జెప్పెదను. ఇట్లు నేజెప్పఁగా విని ఆపిశాచము విశేషసంతోషము నొందెను.

శ్లో॥ పిశాచః ప్రాహమాంవిప్ర స్తుత్వా నత్వా పునః పునః। అవశ్యమేవ వక్తవ్యం మేవృత్తం మమసూనవే॥ ౨౧౦॥ యథాదృష్టం త్వయాపాంథ యథోక్తంచ మయాతవ॥

తా॥ మఱియు నన్ను విశేషముగా స్తోత్రముఁజేసి నాకు మాటి మాటికి నమస్కారముఁజేయుచు నో బ్రాహ్మణుఁడా! నీవు చూచి నట్టియు నేను జెప్పినట్టియు నావృత్తాంతమునంతయు నాకుమారునితో తప్పకుండా జెప్పుమని మఱి మఱి నాతోఁజెప్పెను.

శ్లో॥ అన్యచ్చ కథ్యతాం తస్మై మమ పుత్రాయ సాదరమ్॥ ౨౧౧॥ మధుదర్శేన్నదానస్య మహిమాశక్రియ లేదివి। అతస్త్వంహి మమోద్దేశా దన్నదానం మథోకురు॥ ౨౧౨॥

తా॥ మఱియు నాకుమారునితో నింకొకసంగతి జెప్పవలయును. అదియేమనఁగా చైత్రబహుళ అమావాస్య రోజున అన్నదానముఁ జేసిన యెడల విశేషఫలముకలదని యన్నదాన మహిమ స్వర్గలోక ములోఁగూడ వ్యాపించియున్నది కాఁబట్టి నన్ను గుఱించి చైత్రి బహుళ అమావాస్యయందు అన్నదానమును జేయుమని చెప్ప వలయును.

శ్లో॥ ఏవముక్త్వాస పిశాచః శపథంమాంచకారహ। నబ్రూషే స్మరణంకృత్వా మమపుత్రాయ తద్ద్విజ॥ ౨౧౩॥ భవిష్యతి వృథా సర్వ యాత్రాతవమహామతే॥

తా॥ ఆపిశాచ మీప్రకారముఁజెప్పి మహాబుద్ధిశాలివి యగు నో బ్రాహ్మణుఁడా! నేను చెప్పిన వృత్తాంతమును నాకుమారునితో నీవు చెప్పని యెడల నీవు జేయునట్టి యాత్రలన్నియు నిష్ఫలము లగును. అని ప్రమాణపూర్వకముగాను జెప్పెను.

శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా సాంత్వయిత్వాచతం పునః। నిర్గతోస్మిమథాస్నాను షయోధ్యాంగంతుమాదరాత్॥ ౨౧౪॥

తా॥ ఇట్లు అత్యాదరముతోఁ జెప్పిన వాని మాటలను విని ఆతని సమాధానపరచి చైత్రమాసములో స్నానముఁజేయుటకు నత్యాశక్తితో నయోధ్యను గూర్చి వెళ్లుటకు బయలుదేరితిని.

శ్లో॥ కృత్వాయోధ్యాపురీ మధ్యే చైత్రస్నానం మహాఫలం। యదాగచ్ఛామితాంకాంచీం తదా తస్మైవదామ్యహమ్॥ ౨౧౪॥

తా॥ విశేషఫలము నొసఁగెడు చైత్రమాసములో నయోధ్యయందు స్నానమునుజేసి కాంచీపట్టణమునకు నేను వెళ్లునప్పుడు ఈ వృత్తాంతమునంతయు ఆ శంభునితోఁజెప్పెను.

శ్లో॥ అతఏవ మయాపృష్ట స్తవశంభు ద్విజోత్తమః। ప్రోక్తం గోత్రాదిభిర్లింగం వ ర్తతేచేద్వదస్వమామ్॥ ౨౧౬॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! ఈప్రకారము జరిగినది కాఁబట్టి ఆశంభుని గురించి అడిగితిని. కనుక అట్టి గోత్రనామములుగలవానిని నీ వెరిగితివేని జెప్పుము.

శ్లో॥ ఇతి శంభుః పితుర్వృత్తం జ్ఞాత్వా మూర్చాంగత స్తదా। ఆశ్వాసితశ్చ భిల్లేన విప్రఃప్రోవాచతం పునః॥ ౨౧౭॥

తా॥ ఇట్లు కార్పటికుఁడు చెప్పిన మాటలను విని ఆ శంభుఁడు ఈ వృత్తాంతమంతయు తన తండ్రిదే యగుటచే విశేషదుఃఖముచే మూర్ఛ నొందెను. అంతలో బోయవాఁడా బ్రాహ్మణుని యోదార్చి మూర్ఛ దెలుపఁగా నప్పుడు తిరిగి కార్పటికునితో నిట్లు శంభుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ భోభోకార్పటికశ్రేష్ఠ నమత్తో స్తినరాధమః। యస్త్వయా పృచ్ఛ్యతేశంభు స్సోహం విద్ధినసంశయః॥ ౨౧౮॥

తా॥ ఓయీ కార్పటికుఁడా! నేను మిక్కిలి పనికిమాలిన మనుష్యుఁడను. నీవడిగిన శంభుఁడను వాని వృత్తాంతము నాసంబంధమైనది. నేనే వానియొక్క కుమారుఁడను ఇందుకు సందేహము లేదు.

శ్లో॥ మయాపుత్రేణ నకృతం స్వపితుర్మోక్షదాయకం। అన్నదానాదికం కర్మ ధిగ్ధిఙ్మేయం వృథాభవః॥ ౨౧౯॥

తా॥ నేను కుమారుఁడనైయుండి నాతండ్రికి ముక్తికలుగునట్టి అన్నదానము మొదలగు సత్కార్యములను జేయలేకపోతిని. కాఁబట్టి నాజన్మ వ్యర్థమైనది.

శ్లో॥ ఇదానీం తవవాక్యేన దాస్యామ్యన్నం మథాపితుః॥

తా॥ ఇప్పుడు వానియొక్క వృత్తాంతమునంతయు-నీవుజెప్పితివి కాఁబట్టి నాతండ్రికి ముక్తికలుగుటకు చైత్రమాసములో నన్నదానమును జేసెదను.

శ్లో॥ ఏవంశంభుః కార్పటికా యచోక్త్వా యోధ్యాం రమ్యాం దూరతో దదర్శ। ప్రణేముస్తాం దంపతీపాంథ భిల్లాస్తతః శంభుశ్చాపసత్కార్య శంసః॥ ౨౨॥

తా॥ ఇట్లు శంభుఁడు కార్పటికునితోఁ జెప్పి తాను తనభార్యయు బోయవాఁడు మార్గస్థుఁడు మొదలగు వారందఱును అయోధ్యా పట్టణ సమీపమునకు వెళ్లి కొంచెము దూరములోనుండగానే అయోధ్యాపట్టణమునకు నమస్కారముఁ జేసి యాశంభుఁడు బోయవానితో నిట్లు చెప్పుచున్నాఁడు.

శంభురువాచ॥ శ్లో॥ పశ్యపశ్య మహాభిల్ల మహాయోధ్యాంపురీం శుభాం। యస్యాంస్నాతుం సమాయాతా దృశ్యంతే కోటిశోజనాః॥

తా॥ శంభుఁడు చెప్పుచున్నాఁడు. ఓ భిల్లుఁడా! శోభాయమానముగా నుండెడి అయోధ్యాపట్టణమును జూచితివా. సరయూనదిలో స్నానముఁ జేయుటకు కోట్లతరబడి జనులు వచ్చినట్లు కనఁబడుచున్నది.

శ్లో॥ జనసంఘానాం ధ్వనిశ్చాయం శ్రూయతే మేఘశబ్దవత్ । నానాధ్వజ పతాకాశ్చ దృశంతే చేంద్రచాపవత్॥ ౨౩॥

తా॥ మేఘముల ధ్వనివలెనే విశేషముగా మనుష్యులధ్వనియు వినఁబడుచున్నది. అనేక రంగులతో ప్రకాశించుచు ననేక విధములగు ధ్వజములును ఇంద్రధనుస్సులువలెనే ప్రకాశించుచున్నవి.

శ్లో॥ తథావాద్య ధ్వనిశ్చాయం శ్రూయతే హిమనోహరః। అగ్నిహోత్రాగ్ని ధూమామై ర్వ్యాప్తం పశ్యనభోంగణమ్॥ ౨౪॥

తా॥ ఆప్రకారముగానే వినుటకు నానందముగా భేరీమృదంగాది వాద్యధ్వనులును వినఁబడుచున్నవి. ప్రాతఃకాల సాయంకాలములయందు శ్రోత్రియులుఁ జేయుచుండెడి యగ్నిహోత్రముల యొక్క పొగయును ఆకాశమంతట వ్యాపించినది.

శ్లో॥ కైలాసగిరి సామ్యాని పశ్యసౌధాని కర్కశ । నవప్రతోళీపరిఘా వలయీకృత మేఖలామ్॥ ౨౨౫॥ ఉత్తుంగ హర్మ్యవిలసత్పతాక శత సంకులాం । అభ్రం లిహమహా సౌధ సువర్ణ కలశోజ్జ్వలామ్॥ ౨౨౬॥ పశ్యాయోధ్యాపురీం శ్రేష్ఠాం సరయూతీరనాదితామ్॥

తా॥ ఓ కర్కశుఁడా! ఈ పట్టణము యొక్క శోభనుజూచితివా! ఈ పట్టణములో మేడలు సున్నముచే నలంకరింపఁబడినవై కైలాస పర్వతమువలెనే తెల్లగాను ఎత్తుగాను కనుపించుచున్నవి. నూతనమైన వీధులు ఘడియలు మొదలగువానితోను గూడినదియు ఉన్నతమగు మేడలయందు కట్టబడియున్న యనేక జండాలతోఁగూడి యున్నదియు ఆకాశము పర్యంతమునుండెడి గోపురముల యందు ప్రకాశించుచు బంగారపు కలశములతో వ్యాపించినదియు సరయూ నదీ తీరమందు ననేక విధములగు ధ్వనులతో విలసిల్లుచుండెడి అయోధ్యాపట్టణమును జూడుము.

శ్లో॥ హాటకోద్ఘాటితై రత్న ఖచితై ర్వాకవాటికైః । సుసంవృతైర్వివృతైస్తై రున్మిషంతీవలక్ష్యతే॥ ౨౨౭॥

తా॥ బంగారుతోను నవరత్నములతోను గూర్చబడిన తలుపులు వేయుచు తీయుచుండుటచే పట్టణము కండ్లను తెరచినట్లుగాను మూసినట్లుగానున్నది.

శ్లో॥ దోధూయమానై ర్మరుతా పతాకాంచల సూచిభైః । ఆహ్వాయంతీవపురతో లక్ష్యతేపధికాన్‌జనాన్॥ ౨౨౮॥

తా॥ మేడలయందు కట్టబడిన జండాలయొక్క గుడ్డలు గాలికి కొట్టుకొనుటచే మార్గమునందు నడచుచుండెడి వారిని పిలచుచున్నట్లు కనుపించుచున్నది.

శ్లో॥ అగ్నికృత్యాద్యాభువనాన్ జేతుమేకామరావతీం । ప్రాసాద
శూల వ్యాజేన సన్నద్ధేవానలక్ష్యతే॥ ౨౨౯॥

తా॥ పైభాగమునుండెడి స్వర్గలోకాదులను మేడలచేతను
దిగువనగానుండెడి పాతాళాదిలోకములను శూలములచేతను జయించు
టకు ప్రయత్నించునది వలెను కనుపించుచున్నది.

శ్లో॥ పవిత్రేస్మిన్ మహాక్షేత్రే నివసంతితిరోహితాః । బ్రహ్మ
శహరిభిస్సర్వే దేవాస్తే ఋషయోమలాః॥ ౨౩౦॥

తా॥ పవిత్రమగు ఈ మహాపుణ్యక్షేత్రములో బ్రహ్మ విష్ణు
సాంబమూర్తి ఇంద్రుడు మొదలగు సమస్తదేవతలును నిష్కల్మషు
లైన మునీశ్వరులతోను అంతర్ధానులై యెవరికిని కనుపించకుండా
వ్యాపింపఁబడియున్నది.

శ్లో॥ కుబేర స్పర్ధయాయత్ర చిన్వంతి వసు సంచయాన్ ।
దాతుంభోక్తుం సర్వజనాః స్వధర్మనిరతాస్సదా॥ ౨౩౧॥

తా॥ ఈ యయోధ్యాపట్టణమందుండెడి ధనికులు కుబేరుని
కంటె ధనమునందు నధికులై యొకరికి నిచ్చుటయందును తాము
భుజించుటయందును కుతూహలులైయుందురు. సమస్త జనులును
తమ తమ ధర్మములయందు నాసక్తిగలవారు.

శ్లో॥ గేహేగేహే సదానంద ఏవాసీద్యత్ర వైపురీ । యేషాం
ప్రక్షాళయంతిస్మ చరణాన్ వాసవాదికాః॥ ౨౩౨॥ తేద్విజాః కస్య
నోవంద్యా అయోధ్యానగరీ స్థితాః॥ ౨౩౩॥

తా॥ ఈ పట్టణమందు నెప్పుడును ప్రతియింటను శుభకార్య
ములు జరుగుచు నానందముగానే యుందురు. ఈపట్టణమునందుండెడి
బ్రాహ్మణులు వేదశాస్త్ర శ్రౌతాది విద్యలను నేర్చి తత్కర్మలను
జేయుచు నుత్తములైయుండుటచే వారిపాదములను దేవతలును కడిగి
యాతీర్థమును శిరస్సున జల్లుకొందురు. అట్టి దేవతనే పూజింపఁగా
నాబ్రాహ్మణులను ఇతరులు యెవరు పూజింపకుందురు.

శ్లో॥ ఔదార్యే కల్పతరవో గాంభీర్యే సాగరాఇవ । క్షమయా
క్షమయాతుల్యా జంగమానిగమా ఇవ॥ ౨౩౪॥

తా॥ మఱియు దాతృత్వమందు కల్పవృక్షములవలెనే గంభీరమందు సముద్రములవలెను ఓర్పునందు భూమివలెను సంచరించునట్టి వేదములవలెను ప్రకాశించుచుందురు.

శ్లో॥ దైన్యగ్రాహ మహాంభోధి గ్రాసాగస్త్య మహార్ణయః। నివసంతి ద్విజాయత్ర వంద్యాస్సర్వ మహీభుజామ్॥ ౨౩౫॥

తా॥ అగస్త్యమహాముని సముద్రపానముఁజేసినట్లు ఆయూరియందు గల బ్రాహ్మణులు దీనత్వమనే మహాసముద్రమును పానముఁజేసెడివారు. అనఁగా నెప్పుడును దరిద్రములేక యొకరిని యాచించువారుకారు. కాఁబట్టి సమస్త ప్రభువులును సిరియందు గౌరవముకలిగి సేవించుచుందురు.

శ్లో॥ చతుర్వర్గ ఫలోపేతే చాతురాశ్రమ్యముజ్వలం। చాతుర్వర్ణ్యమిహైవాస్తే చతురామ్నాయ మార్గగమ్॥ ౨౩౬॥

తా॥ ఋగ్యజుస్సామాథర్వణములనెడి నాలుగు వేదములలోఁ జెప్పినట్లు నడచుకొనుచు ధర్మార్థ కామమోక్షములనెడి చతుర్వర్గ ఫలములతోను బ్రహ్మచర్య గృహస్థవానప్రస్థయత్యాశ్రమములతోను గూడియుండెడి బ్రాహ్మణులుకలవారు గనుకనే యీ పట్టణమందు నాలుగు వర్ణములువారు స్వధర్మమందు నిరతులైయుండిరి.

శ్లో॥ క్రిమికీట పతంగానాం విజ్ఞాన సమాధిభిః। అతనిర్వాణ పద్ధవీ సులభాస్తివనేచర॥ ౨౩౭॥

తా॥ ఓ వనచరుఁడా! పురుగులు పక్షులు పశువులు గాక యీపట్టణమందుగల మనుష్యులందరును జ్ఞానము యోగము సమాధి మొదలగునవి నేర్చినవారు కాఁబట్టి మోక్షమును విశేషకష్టము లేక సులభముగా నొందుదురు.

శ్లో॥ ఏనః పానఘటాంభోక్తుం తరంగానంకుశానివ। బిభర్తి సరయూతోయం నిశ్రేణిభోగ మోక్షయోః॥ ౨౩౮॥

తా॥ ఈ సరయూనదిలో స్నానముఁజేయుట యుదకమును పానముఁజేయుట మొదలగువానిచే నాయూరియందుగల జనులు పాపరహితులై ముక్తినొందుటచేత రంగములనెడి మెట్లచే సరయూ

నది స్వర్గలోకమును పొందించుచున్నట్లుగానున్నది. కాబట్టి భోగమును మోక్షము నొసగును.

శ్లో॥ పశ్యన్ స్ఫటిక సోపాన నివిష్టమునిసంస్తుతాం । సరయూనదీముత్తరీయమివ శ్రీరామస్య॥ ౨౩౯॥

తా॥ ఈ సరయూనది యొక్క తీరమందుగల స్ఫటిక సోపానముల మీద మునిశ్రేష్ఠులు కూర్చుండి ధ్యానము జేయుచున్నారు. చూడుము. మరియు శ్రీరాముని సరయూనదిపైన ధరించునట్టి యుత్తరీయముగా బ్రహ్మ నిర్మించెనా యనునట్లున్నది.

శ్లో॥ ఇంద్రనీల మహాతుంగ ప్రతోళీ మకరవర్ణనః । రామచంద్రస్య దివ్యాలయం ప్రకాశస్తుంగతోరణః॥ ౨౪౦॥

తా॥ ఇంద్రనీల మణులతోను పొడవగు మకరతోరణముల తోను గూడి శ్రీరామచంద్రుని యాలయము దేదీప్యమానముగా ప్రకాశించుచు సరయూతీరమందు పెద్దసీమలో చూచుటకు నందముగా విలసిల్లుచున్నది.

శ్లో॥ ప్రాసాదీయస్యనుత్తరా కాశ్మీరైస్తు సుంతరలం । సీతాయాశ్చ మహాభవ ప్రాసాద రత్నతోరణః॥ ౨౪౧॥

తా॥ కాశ్మీర దేశమందు గల శ్రేష్ఠమగు స్వచ్ఛమైన రాళ్లచే గట్టబడినదియు రత్నములతోను మకరతోరణములు కలిగి ప్రకాశించుచున్న సీతాదేవియొక్కయు గుడి విలసిల్లుచున్నది.

శ్లో॥ నానారత్నైర్విరచితశ్చ హేమస్తంభ విరాజితః । స్ఫటికై స్తుషితశ్చాత్ర స్సరయూతీర సంశ్రితః॥ ౨౪౨॥

తా॥ మరియు ననేకరత్నములతోను బంగారు స్తంభములతోను తెల్లని రాళ్లతోనుగూడి చూచుటకు నతిరమ్యముగానుండి చిత్రవిచిత్రముగా సరయూనది గట్టున ప్రకాశించుచున్నది.

శ్లో॥ రామతీర్థ సమీపేయం సీతారామస్య వైపరః। ప్రాసాదో విమలోభాతి తప్తకాంచన నిర్మితః॥ ౨౪౩॥ పతాకాభి ర్విచిత్రాభిః కలశైస్సు విరాజితః॥

తా॥ కరిగించి మలినములేకుండా జేసిన బంగారముతోఁగట్టఁబడినదియు చిత్రమైన జంపాలతోఁగూడినదియు బంగారు కలశలతోఁగూడినదియునగు విమలమైన సీతారాములయొక్క యాలయము రామతీర్థ సమీపమున నందముగా ప్రకాశించుచున్నది.

శ్లో॥ ఉత్తప్తజాంబూనద రత్న కుంభః ప్రవాళ వైడూర్య నిబద్ధ భూమిః। హేమప్రతోళీరచితస్స ఏష ప్రాసాదవర్యో స్థిహలక్ష్మణస్య॥

తా॥ కరగించిన బంగారముతోను రత్నఖచితమగు కుంభముల తోను పవడములు వైడూర్యములు మాణిక్యములు మొదలగువాని తోను బంగారపు గోపురముతోను గూడి లక్ష్మణస్వామి యొక్క ఆలయమిదిగో యిక్కడనే ప్రకాశించుచున్నది.

శ్లో॥ చాతుర్యం యత్రవిశ్రాంతం సకలం విశ్వకర్మణః। సోయం భరతరాజస్య ప్రాసాదోహే మతోరణః॥ ౨౮౭॥

తా॥ విశ్వకర్మ యొక్క తనకుండెడి శిల్ప తనమంతయుఁ జూపించి కట్టినట్లుగా విలసిల్లుచు బంగారపు తోరణములుగలిగి యీ భరతునియొక్క యాలయము ప్రకాశించుచున్నది.

శ్లో॥ తథా దేదీప్యమానోయం రత్నభిత్తి వినిర్మితః। ప్రాసాదో దృశ్య తేరమ్యః శత్రుఘ్నస్య శుభావహః॥ ౨౮౮॥

తా॥ రత్నఖచితమగు గోడలతోఁగూడి శోభస్కరమై దేదీప్యమానముగా ప్రకాశించుచు జూచుటకు నతిరమ్యముగా శత్రుఘ్నుని యాలయముఁగూడ చూడఁబడుచున్నది.

శ్లో॥ స్ఫటికైర్భిత్తిభిశ్చిత్రః ప్రోచ్చః కనకరేఖకః। ప్రాసాదో వాయు పుత్రస్య దృశ్యతేయం మహోజ్జ్వలః॥ ౨౮౭॥

తా॥ తెల్లని స్ఫటికరాళ్లతోను బంగారపు రేఖలతోను గూడి చిత్రముగాను విశేషశోభస్కరముగాను ఎత్తుగాను ఆంజనేయుల యొక్క ఆలయముఁగూడ ప్రకాశించుచున్నది.

శ్లో॥ యఏషముక్తా ఫలజాలశోభి స్సుదర్శనాంకః ఖగరాజ కేతుః। కుశస్యరమ్య స్త్వయమావిరాస్తే ప్రాసాదకుంభః కిముబాల సూర్యః॥ ౨౮౮॥

తా॥ ముత్యముల సరములతోను శంఖచక్రములతోను గరుడ ధ్వజముతోను గూడినదియు గోపురశిఖరమున బంగారు కలశతో గూడి బాలసూర్యుడువలెనే గుడుని యాలయము విలసిల్లుచున్నది.

శ్లో॥ ప్రాసాదోయం లవస్యాత్ర బహురత్న విరాజితః । యత్ర చిత్రాణ్యనేకాని మోహయంతి నృగీన్నృశాన్॥ ౨౮౯॥

తా॥ అనేక రత్నములతో గూడి బహుచిత్రముగా గట్టుటచే స్త్రీలనుగూడ భ్రమపుట్టించునట్టి లవునియొక్క యాలయము ప్రకాశించుచున్నది.

శ్లో॥ చక్షూంషిజాతరాగాణి యోగినామపిమానసం । విన్యస్త రత్నవిన్యాసా శ్యాత్రసంభ భగస్త్రాబహిః॥ ౨౯౦॥ హేమయంతీవసతతం రత్నసాను మహాప్రభాం । రత్నప్రాసాద సంయుక్తా మయోధ్యాం పశ్యసుప్రభాః॥ ౨౯౧॥

తా॥ బంగారపు భూములుగలిగి రత్నములతో గూర్చబడి రత్నస్థగితమగు మేడలతో గూడినట్టి విశేషకాంతిచే బ్రకాశించుచు స్వర్గలోకమునుగూడ తిరస్కరించుచుండెడి అయోధ్యాపట్టణమును జూడుము. వైరాగ్యముగానుండెడి మునీశ్వరులనుగూడ చూచుటకు రమ్యముగానుండి మనస్సు నాకర్షించుచున్నది.

శ్లో॥ యదంగణం క్షాలయంతీ నదీయం స్వీయైర్జలైస్సోయమ సర్వత్రరత్నః । అభ్రంకషైర్హేమ మయైస్స్వసంభై ర్విరాజితోయం ఖలుచిత్రకేతోః॥ ౨౯౨॥

తా॥ విశేషవిలువగల నవరత్నములతో గూర్చబడి యాకాశము పర్యంతము శిఖరములతో వ్యాపించి కలశములతో గూడి యున్న చిత్రకేతువుయొక్క గుడియు చూడుము. సరయూనదీతీరమందుండుటచే గుడి సమీపప్రదేశమును తన జలముచే కడుగుచున్నది.

శ్లో॥ దివ్యప్రవాళఘటితే కవాటే యత్రచంచలే । ప్రాసాదోయ మంగదస్య సుకృభిత్తి వినిర్మితః॥ ౨౯౩॥

తా॥ దేదీప్యమానముగా ప్రకాశించు పవడములుగూర్చిన తలుపులతోను బంగారపు గోడలతోను గూడి ప్రకాశించెడి అంగదుని యాలయముఁజూడుము.

శ్లో॥ గరుడోద్గార ఘటిత ప్రతోళీ పరిశోభితః । ప్రాసాదః పుష్కరస్యాయం నయనానందదో నృణామ్॥ ౨౫౪॥

తా॥ మరకతమణులచే స్థాపింపఁబడిన ద్వారశాఖలతోఁగూడి ప్రకాశించుచుండెడి పుష్కరుని యాలయమును జూడుము. సమస్తమైనవారికిని చూచుటకు నానందముగానున్నది.

శ్లో॥ విశుద్ధజాంబూనదదివ్య భూమిలసత్పతాక స్త్రిదశాభివంద్యః। ప్రాసాదఏషః పరమో మనోజ్ఞస్తస్యవీర్యస్య మహాన్విభాతి॥ ౨౫౫॥

తా॥ నిర్మలమగు శ్రేష్ఠమైన బంగారపు భూమి గలదియు ప్రకాశించునట్టి జండాలు గలదియు దేవతులకు నమస్కరింపఁ దగినదియు మిక్కిలి మనోహరముగానుండినదియునగు పరాక్రమవంతుఁడగు తక్షుని యొక్క గొప్ప యాలయము ప్రకాశించుచున్నది.

శ్లో॥ యస్యాధిభూమిం నవరత్నసింహః త్రిభిఃపదైర్భూర్విజితాత్రయోపి । లోకాశ్చతుర్థో నహి దృశ్యతేతఃపదం సముద్యమ్యకిమాస్తే॥ ౨౫౬॥

తా॥ ఆ యాలయములయందు విచిత్రములుగా విగ్రహములు గూడ వేయఁబడును కాఁబట్టి యొక ఆలయముమీద నవరత్నములతోఁ గూర్చబడి యొక సింహవిగ్రహముఁగూడ వేయఁబడి యొక కాలును పైకియెత్తియున్నట్లుగా వేయఁబడినది. అది యేవిధముగా నుత్ప్రేక్షింపఁబడినదనఁగా. ఈసింహము విష్ణుమూర్తియొక్క సింహావతారమునుగాను వామనావతారమునకు దీనికి అభేదముగా భావించి సింహమునకు నాలుగు కాళ్లు కలవు కనుక నేను మూఁడుపాదములచే మూఁడు లోకములను వామనావతారములో నాక్రమించితిని నాల్గవ పాదమునకు నాల్గవ లోకములేదు. కాఁబట్టి యీనాల్గవపాదము దేనిమీఁద పెట్టనా యని యెత్తుకొనియున్నట్లుగా నాల్గవపాదము యెత్తుకొనియున్నట్లు యొక సింహవిగ్రహము వేయఁబడినది.

శ్లో॥ అఘౌఘమత్తకరిణాం ఘటాదారయితుంకిము । ఉదస్త చరణోయస్య రత్నసింహో విరాజతే॥ ౨౪౭॥

తా॥ పాపములనెడి మదించిన యేనుఁగు సంఘములను చీల్చి వేయుటకు కాలుయెత్తుకొని యున్నదా యనునట్లు యొక సింహమును యొకకాలుయెత్తుకొని యున్నట్లుగా రత్నఖచితమైన సింహవిగ్రహము వేయఁబడినది.

శ్లో॥ సోయం హేమభిత్తిమయః ప్రాసాదః ప్రోన్నత శ్శుభః । సుబాహోః పశ్యభోభిల్ల రత్నసాను విరాజితః॥ ౨౪౮॥

తా॥ ఓ బోయవాఁడా! బంగారపు గోడలు కలదియు రత్న ఖచితమగు మెట్లుకలదియు నెత్తుగానున్నట్టి సుబాహువుయొక్క యాలయమును చూడుము.

శ్లో॥ రత్నప్రవాళ స్ఫటిక నీలకాశ్మీర నిర్మితః। ప్రాసాదోయం యూపకేతో ర్మహాద్దీప్తి మయశ్శుభః॥ ౨౪౯॥

తా॥ రత్నములు పవడములు స్ఫటికములు ఇంద్రనీలమణులు కాశ్మీరదేశపు రత్నములు మొదలగు వానితోఁ గూర్చబడిన యూప కేతువుయొక్క యాలయము విశేషకాంతిచే బ్రకాశించుచున్నది.

శ్లో॥ పల్లారైరుత్పలైశ్శ్వేతై రరవిందైశ్చ తచ్ఛదైః । విరాజితం పాపహరం రామతీర్థం ప్రదృశ్యతే॥ ౨౫౦॥

తా॥ ఎఱ్ఱకలువలు తెల్లకలువలు నల్లకలువలు నూఱురేకులు గల తామరపువ్వులు మొదలగువానితోఁ గూడి పాపములను నశింప జేయునట్టి రామతీర్థము ప్రకాశించుచున్నది చూడుము.

శ్లో॥ ఇందూత్పలైరవిరలై ర్నిబద్ధాయస్య భూమయః । హరంతి గ్రీష్మసంతాపం నిష్పందశీ కరోత్కరైః॥ ౨౫౧॥

తా॥ దట్టనగా గూర్చబడిన చంద్రకాంతమణులుగల భూములు చల్లని యుదకబిందువులను స్రవింపఁజేయుటచే నెండచే సంభవించెడి సంతాపమును పోగొట్టుచున్నవి.

శ్లో॥ అమందకురు విందానాం విన్యాసైర్యత్ర చారుభిః । ముహ్యంతి శుకచేతాంసి ముద్గదాడి మశంకయా॥ ౨౫౨॥

తా॥ దట్టనగా గూర్చబడిన సుందరమగు కురువిందపుష్పములు గల భూములనుజూచి పెసలు దానిమ్మగింజలు అనునట్టి భ్రాంతి చిలుకలకు గలుగుచున్నది.

శ్లో॥ ఏవంపశ్య శుభాంరమ్యాం పతాకాభి ర్విరాజితాం। భిల్లా యోధ్యాం ముక్తిపురీం ద్వితీయా మమరావతీమ్॥ ౨౬౩॥

తా॥ ఓ బోయవాఁడా! ఇట్లు మహాశోభస్కరముగాను సుందరముగానున్నదియు, జండాలతోఁగూడి చక్కగానున్నట్టియు, యిందుౖనిపట్టణమగు రెండవ అమరావతి వలెనే ప్రకాశించుచు ముక్తి నొసఁగునట్టి అయోధ్యాపట్టణమును జూడుము.

శ్లో॥ యత్రకార్త స్వరఘటాః ప్రతోళీ శిరస్సిస్థితాః । రామం ద్రష్టు మనంతా స్తం ప్రాప్తాస్సూర్యా ఇవాబభుః॥ ౨౬౪॥

తా॥ అక్కడ గోపురములయందుంచబడిన బంగారపుకుంభము లెట్లుగా నుండినవి యనఁగా శ్రీరామమూర్తిని జూచుటకు ననేక సూర్యులు వచ్చిరా యనునట్లు ప్రకాశించుచున్నవి.

శ్లో॥ ఏవముక్త్వా కర్కశేన పత్న్యాకార్పటికేనచ। సహితశ్చ తదాశంభు స్తాంపురీంసంవివేశసః॥ ౨౬౫॥

తా॥ ఈవిధముగా నయోధ్యాపట్టణము యొక్క వైభవమును జెప్పి బోయవాఁడు తన భార్య నీళ్లుమోసికొని పోవువారలతోఁగూడి శంభుఁడు అయోధ్యాపట్టణమునకు వెళ్లెను.

శ్లో॥ రామతీర్థం తతోగత్వా కృత్వా క్షౌరాదికం విధిం। ఉపోష్య దినమేకంహి తీర్థేశ్రాద్ధం చకారసః॥ ౨౬౬॥

తా॥ ఇట్లు రామతీర్థమునకు వెళ్లిన పిమ్మట క్షౌరము మొదలగు కృత్యములను దీర్చుకొని యాదినమందుపవాసముఁజేసి మరునాడు తీర్థశ్రాద్ధాది విధులను నెరవేర్చుకొనిరి.

శ్లో॥ అమావాస్యాం శుభేచైత్రే ప్రాప్తాంజ్ఞాత్వా ద్విజోత్తమః। ముక్త్యర్థం స్వపితుశ్చక్రే హ్యన్నదానం యథావిధి॥ ౨౬౭॥

తా॥ శుభముల నొసఁగునట్టి చైత్రమాసములో నమావాస్య

తిథిరాగానే యాశంభుఁడు తన తండ్రికి ముక్తికొఱకు యథావిధిగా నన్నదానముఁ జేసెను.

శ్లో॥ తచ్చైత్రమాసే రజనీశసంక్షయే దత్తం పితుర్యచ్ఛుభదం మనోహరమ్ । విప్రేణచాన్నం పథికస్యవాక్య తస్తస్మాత్పిశాచ సుర సద్మనిస్థితః॥ ౨౬౮॥

తా॥ ఆ శంభుఁడు పిశాచస్వరూపనొందిన తన తండ్రియొక్క ముక్తికొఱకు శుభముల నొసగునదియు నందరు సంతోషించతగినట్టి యన్నదానమును చేయగా నచ్చట భుజించిన బ్రాహ్మణులు దారిని బోవుచు శంభునియొక్క యన్న ప్రదానమును జెప్పుకొనుచు వెళ్లు చుండిరి. ఆవార్తను శంభుని తండ్రి వినినందున ఆతనిపిశాచ స్వరూపము పోయి స్వర్గలోకములో నివాస మాతనికి కలిగినది.

శ్లో॥ అయోధ్యాయాం తతశ్శంభుః కృత్వా చైత్రేవగాహనం । ఉద్యాపన విధించాపి యథోక్తంచ చకారసః॥ ౨౬౯॥

తా॥ అనంతరమిట్లు చైత్రమాసములో నయోధ్యాపట్టణమందు సరయూనదిలో శంభుఁడు స్నానముఁ జేసి యథావిధిగా నుద్యాపనము గూడ జేసెను.

శ్లో॥ కర్కశోపి మధౌస్నాత్వా ముక్త్వా పాపౌఘభూధరం । అయోధ్యానగరీమధ్యే సాధువృత్యావసచ్చిరమ్॥ ౨౭౦॥

తా॥ ఆ కిరాతుఁడును చైత్రమాసములో స్నానముఁ జేయుటచే సమస్త పాపములు నశించినందున ఆ యయోధ్యాపట్టణములోనే సాధుస్వభావముతో నుండెను.

శ్లో॥ శ్రీరామచింతనం కుర్వన్ నినాయాయుష్య సంక్షయం । తతః ప్రాపహరేర్లోక మయోధ్యా మరణేనసః॥ ౨౭౧॥

తా॥ శ్రీరామచంద్రమూర్తిని నిత్యము ధ్యానముఁ జేయుచు నిట్లు ఆయుర్దాయము క్షయమగు వఱకు సద్వృత్తిగానే జరిపి అంత మందు నయోధ్యాపట్టణములో మృతినొందుటచే వైకుంఠమునొందెను.

శ్లో॥ శంభుశ్చాపి మధౌ స్నానం కృత్వా కాంచీపురీం పునః । గంతుంప్రతస్థే శ్రీరామం నత్వా యోధ్యాం పునః పునః॥ ౨౭౨॥

తా॥ శంభుఁడును సరయూనదియందు చైత్రమాసములో స్నానముఁజేసి శ్రీరామచంద్రమూర్తికి నయోధ్యా పట్టణమునకు మాటిమాటికి నమస్కారముఁజేసి తిరిగి కాంచీపట్టణమునకు బోవుటకు ప్రయాణమాయెను.

శ్లో॥ భార్యయా సహితశ్శంభు స్తేనకార్పటికేనచ । యయౌ పూర్వేణమార్గేణ యత్రతౌ కరికేహరౌ॥ ౨౭౩॥ స్థాపితౌ శపథైః కృత్వా శనై స్తత్ర సమాగమత్॥

తా॥ ఇట్లు శంభుఁడు తన భార్యతోటి కార్పటికునితోటిగూడి తూర్పు దిక్కుగా ప్రయాణమై పూర్వము ప్రమాణముఁజేసి యుంచి వచ్చిన యేనుఁగు సింహము నున్నచోటికి వచ్చెను.

శ్లో॥ దత్వా దినద్వయం పుణ్య యుభాభ్యాం మధుమాసజం । దత్వాస్వీయాం జలాతోయం తయోర్ము క్తించకారసః॥ ౨౭౪॥

తా॥ ఆ శంభుఁడు చైత్రమాసము నెలదినములు స్నానముఁజేసిన పుణ్యములో రెండు దినముల పుణ్యము. ఆ గజసింహములకు తన చేతిలో నుదకమునుంచుకొని ధారబోసి యా గజసింహములకు ముక్తికలుగజేసెను.

శ్లో॥ తతస్తౌ కరిసింహౌచ దివ్యమాల్యాను లేపనౌ । దివ్యం విమానమారుహ్యా విష్ణులోకం గతావుభౌ॥ ౨౭౫॥

తా॥ అనంతర మా గజసింహశరీరములు పోయి దివ్యమంగళ శరీరులై శ్రేష్ఠమగు గంధము పుష్పమాలికలను ధరించినవారలై దేదీప్యమానముగా వెలుఁగుచుండెడి విమానము నెక్కి విష్ణులోకము నకు వెళ్ళిరి.

శ్లో॥ తతోగ్రే ద్విజవర్యస్స యయౌ మార్గేణ భార్యయా । సయత్ర రాక్షసః పూర్వం స్థాపితః శపథైర్వనే॥ ౨౭౬॥ తందృష్ట్వా రాక్షస శ్రేష్ఠం భార్యాం ప్రాహద్విజో త్తమః॥ ౨౭౭॥

తా॥ అనంతరము తూర్పు మార్గముగా భార్యతోఁగూడ బోవుచు ప్రమాణములనుఁజేసి నమ్మించి ఆపివచ్చిన ఆరాక్షసుఁడున్న

ప్రదేశమునకువెళ్లి యారాక్షసునిజూచి యాబ్రాహ్మణుఁడు తన భార్యతోనిట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అయికాశ్యా హ్వయేరమ్యే శ్రుణుమేవచనం శుభం। యాత్వయా శీతలాగౌరీ స్నాత్వావై సరయూజలే॥ తస్యైకదివసస్యాద్య దేహిపుణ్యం శుభావహమ్॥ రాక్షసాయహిమద్వాక్యా ద్గృహీత్వాజల మంజసా॥ ౨౮॥

తా॥ కాశియను పేరుగల యో ప్రియురాలా! శుభముల నొసగునట్టి నేజెప్పెడి మాటలను వినుము. శీతలాగౌరీదేవి ప్రీతికొఱకు చైత్రమాసములో సరయూనదీ జలములయందు స్నానముఁజేసితివి. ఈరాక్షసుని యొక్క శాపవిమోచనము కొఱకు ఒక దినమునందు జేసిన స్నానఫలమును చేతిలో నీళ్లుపోసికొని యిప్పుడీరాక్షసునికి ధార బోయుము. నామాటలననుసరించి యాచరింపుము.

శ్లో॥ ఇతిశంభువచశ్శ్రుత్వా పద్మనేత్రాకృశోదరీ।కాశీనామ్నా ద్విజపత్నీ దదౌపుణ్యం నిజంతదా॥ ౨౦॥

తా॥ పద్మములవంటి నేత్రములుకలదియు, సింహానడుమువంటి నడుముకలదియు, కాశియను పేరుగల యాబ్రాహ్మణుని భార్య తన పెనిమిటి చెప్పిన మాటలను విని అప్పుడే యారాక్షసునకు తన పుణ్యము నిచ్చెను.

శ్లో॥ తతస్సరాక్షసశ్రేష్ఠ స్త్యక్త్వాదేహం మలీమసం। దివ్యం విమానమారుహ్య నత్వాభార్యా యుతంద్విజమ్॥ దివ్యమాల్యాం బర ధరో హరిలోకం జగామసః॥ ౨౧॥

తా॥ అనంతర మారాక్షసుఁడు పాపసంబంధమగు తన రాక్షస దేహమును వదలి దేదీప్యమానమగు దేవతావిగ్రహుఁడై భార్యతోఁ గూడియున్న యాబ్రాహ్మణునకు నమస్కరించి దేవతాసంబంధమగు వస్త్రములు గంధము పుష్పమాలికలను ధరించి దేవతావిమానము నెక్కి విష్ణులోకమునకు వెళ్లెను.

శ్లో॥ శంభుశ్చాపి ప్రియాయుక్తో మధుమాసం వివర్ణయన్। యయౌ కాంచీపురీం శ్రేష్ఠా జనాన్వృత్తం నివేదయన్॥ ౨౨॥

తా॥ శంభుఁడును భార్యతోఁగూడ నడచుచు మార్గమములో చైత్ర మాసమాహాత్మ్యమును జెప్పుకొనుచు శ్రేష్ఠమైన కాంచీపట్టణమునకు వెళ్లి యాపట్టణపు జనులతోఁ జరిగిన వృత్తాంతమునంతయు జెప్పెను.

శ్లో॥ భోపిశాచ యథా పృష్టం భవద్భిశ్చ కథానకం । తత్స ర్వంచ మయాఖ్యాతం రాక్షసోద్ధరణాదికమ్॥ అ॥ 3॥

తా॥ ఓ పిశాచమా! రాక్షసుల శాపవిమోచనము మొదలగు మీరడిగిన సంగతులనన్నియు యథాప్రకారముగా మీకుఁ జెప్పితిని. అని నృసింహుఁడను బ్రాహ్మణుఁడు పిశాచములతోఁజెప్పెను.

రామదాసఉవాచ॥ శ్లో॥ ఇత్యుక్త్వా నృహరిర్విప్రో గృహీత్వా స్వాంజలౌజలం । దదౌదినద్వయస్యాథ పుణ్యాం చైత్రకృతంనిజం॥

తా॥ రామదాసు చెప్పుచున్నాఁడు. ఇట్లు నృసింహుఁడను బ్రాహ్మణుఁడు చెప్పి తన దోసిలిలో నుదకమునుంచుకొని చైత్రమాస స్నాన ఫలములో రెండు దినముల ఫలము నిచ్చివేసెను.

శ్లో॥ తతః ప్రోవాచ భార్యాంతు రమ్యే చంద్రప్రభే ప్రియే । యాత్వయా శీతలాగారీ స్నాతాసీతా కృతేవరే ॥అ॥ీ॥ తీర్థేఽతస్యా దినైకస్య దేహిపుణ్యాం శుభాననే । పిశాచిన్యా సముద్ధర్తుం మావి చారోస్తుతేహ్యాది॥ అ॥ ॥

తా॥ అనంతరము భార్యతో నిట్లు చెప్పుచున్నాఁడు. మనో హరమగు చంద్రకాంతివంటి కాంతిగల యో ప్రియురాలా! చైత్ర మాసములో సీతలాగారీదేవిని గుఱించి శ్రేష్ఠమగు రామతీర్థములో స్నానముఁజేసిన పుణ్యములో నొక్క దినములో కలిగిన పుణ్యమును పిశాచములయొక్క శాపవిమోచనము నిమిత్తము యిమ్ము. నీ మన స్సులో నెంతమాత్రము సందేహించక శీఘ్రముగా నివ్వవలయును.

శ్లో॥ ఇతి భర్తృవచశ్శ్రుత్వా రమ్యాపంకజలోచనా । లక్ష్మీ నామ్నా మమమాతా దదౌపుణ్యాం నిజంతదా॥ అ॥ 2॥

తా॥ ఇట్లు పెనిమిటి చెప్పిన వాక్యములను విని పద్మముల వంటి నేత్రములు కలదియు యోగ్యురాలునగు లక్ష్మియనెడి నాతల్లి తన పుణ్యమును ఆరాక్షసులకు నిచ్చెను.

శ్లో॥ తతః పిశాచాస్తే సర్వే ముక్త్వాశ్శీఘ్రం శుభావహాః।
నిజరూపాణ్యవాపుః పత్రిణేమునర్నృహరింజవాత్॥ ౨౮౮॥

తా॥ అనంతర మాముగ్గురు పిశాచములు శాపవిముక్తులై శోభస్కరమగు నిజరూపముల నొంది శీఘ్రముగా నానృసింహుఁడను బ్రాహ్మణునకు నమస్కరించిరి.

శ్లో॥ నత్వాస్తుత్వా పునర్నత్వా నృహరింతం ప్రియాయుతం।
ఆపృచ్ఛ్యజగ్ముస్తేసర్వే గురోర్ధామప్రతి॥ ౨౮౯॥

తా॥ భార్యతోఁగూడియుండిన యా నృసింహుఁడను బ్రాహ్మణునకు మాటికి మాటికి నమస్కారమ్ములఁజేయుచు స్తోత్రముఁజేయుచు వానితోఁజెప్పి యనుజ్ఞదీసికొని యా ముగ్గురును తమ గురువువద్ద కేగిరి.

శ్లో॥గురుశ్చాపిసుతాంస్వీయాం తాందదావతిహర్షితః।తయో జ్యేష్ఠా యశిష్యాయ కనిష్ఠాపరాంసుతాం॥ ౨౯౦॥ స్వీయోదరస ముత్పన్నాం నదావపత్రిమాం వరామ్॥ ౨౯౧॥

తా॥ ఆగురువు మొదట శిష్యులు ప్రేమించియున్న తన కుమార్తెను ఆయిద్దరు శిష్యులలో పెద్దశిష్యునకును పెద్దకుమార్తెను రెండవ కుమార్తెను రెండవ శిష్యునకునిచ్చి పెండ్లిచేసెను.

శ్లో॥ తతస్తౌసస్త్రీయావిప్రౌ జగ్మతుస్తౌముదాన్వితౌ। స్వస్వపితుశ్చాశ్రమంహి తయోస్తాపితరావపి॥ దృష్ట్వాపుత్రౌ సమాయాతౌ సస్త్రీయౌ తోషమాపతుః॥ ౨౯౨॥

తా॥ ఇట్లు ఆయిద్దరు శిష్యులును వివాహమగుటచే భార్యలతోఁగూడి సంతోషచిత్తులై తమ తమ తండ్రి యిండ్లకేగిరి. ఇట్లు భార్యలతోఁ గూడ వచ్చిన తమ పుత్రులనుజూచి తల్లి దండ్రులు సంతోషించిరి.

శ్లో॥ నృహరిశ్చ ప్రియాయుక్తో బ్రకంప్రతిసమాయయౌ॥ ౨౯౩॥
చైత్రస్నానేన తత్పుత్రో రామదాసు భిధ స్త్వహం। జాత స్తతస్తౌ దేహాంతే జగ్మతు వైష్ణవంపదమ్॥ ౨౯౪॥

తా॥ నాతండ్రియగు నృసింహుఁడును అబ్జకపట్టణముకువచ్చెను. ఇట్లు వారు చైత్రమాసములో స్నానముఁజేయుటచే నేను వారికి పుత్రునిగా జన్మించితిని. రామదాసు అని నాకు నామకరణముఁ జేసిరి. అనంతరము నాతల్లిదండ్రులు దేహాంతమందు విష్ణులోకము నొందిరి.

శ్లో॥ ఏవంశిష్య మధుస్నాన మహిమా బహుభిర్నరైః । దేవైస్సిద్ధైశ్చ గంధర్వై స్సదానుభవతో స్తిహి॥ ౭౫౪॥

తా॥ ఓ శిష్యుఁడా! ఈప్రకారము దేవతులు సిద్ధులు గంధర్వులు మనుష్యులు మొదలగు సమస్తమైనవారిచేతను చైత్రమాస స్నాన మహిమ స్వానుభవముగాఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ తస్మా న్మధావ వశ్యంహి స్నాతవ్యం మానోత్తమైః । రామతీర్థేషు సర్వత్ర రామచంద్రం ప్రపూజయేత్॥ ౭౫౫॥

తా॥ కాఁబట్టి సమస్తమైనవారును రామతీర్థములున్న సమస్త క్షేత్రములయందును చైత్రమాసములో స్నానముఁజేసి శ్రీరామచంద్రమూర్తిని పూజించవలయును.

శ్లో॥ ఏవంత్వయా యథాపృష్టం తథాసర్వం నివేదితం।మయా కాన్యా స్పృహాతే స్తి శ్రోతుంతద్వదవచ్మ్యహమ్॥ ౭౫౬॥

తా॥ ఓ శిష్యుఁడా! నీవు అడిగిన ప్రకారము చైత్రమాస మహిమను సమస్తమును జెప్పితిని. మఱియు నింకనేదియైన నడుగ దలచితివేని యడుగుము నీవు కోరెడు సమస్త విషయములను జెప్పెదనని రామదాసు అనెడు గురువు విష్ణుదాసు అనెడి శిష్యునితో ఈ చైత్రమాసమహిమను సవిస్తరముగా జెప్పెను.

ఇతి శ్రీశతకోటి రామచరితాంతర్గతే శ్రీమదానంద రామాయణే - వాల్మీకీయే మనోహరకాండే - చైత్రస్నాన మాహాత్మ్యం నామైకాదశస్సర్గ స్సంపూర్ణః॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

